# మానవతకు భరోస

## మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి అర్ధదశాబ్దోత్సవ సావనీర్

సంకలనం

**గౌరవ్**

ప్రచురణ

**మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి**

తెలుగు రాష్ట్రాలు

# మానవతకు భరోస

## మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి అర్ధదశాబ్దోత్సవ సావనీర్

**విజ్ఞప్తి**

ఇందులో అభిప్రాయాలన్నీ ఆయా వ్యాసకర్తలవి మాత్రమే.
సమితి కచ్చితంగా ఆయా భావాలన్నింటితోనూ ఏకీభవించనవసరం లేదు.


**కృతజ్ఞతలు**

**డా॥ చెలికాని స్టాలిన్** (రామచంద్రపురం)

**డా॥ ఎమ్.వి.ఆర్. కృష్ణాజీ** (విజయనగరం)

**దాడి గంగాధర్రావు** (రాజమండ్రి)

**నక్కా సూర్యనారాయణ** (పిఠాపురం)

సంకలనం

గౌరవ్

ప్రచురణ

మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి

ముద్రణ

అక్టోబర్, 2017

ప్రతిపాదిత చందా

10/- (పది రూపాయలు)

ప్రతులకు

9032094492

# ఇందులో...



## అంకితం

**పుట్టిన తొట్టతొలి నాట నుండి చిట్టచివరి క్షణం దాకా ప్రజలకోసమే జీవించి, తెలుగు నేలపై మద్యపాన వ్యతిరేక ప్రచారోద్యమాన్ని అన్నీ తానై నడిపించిన**



**ఆంధ్ర గాంధీ, కళాప్రపూర్ణ, పద్మభూషణ్**

**శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి**

**ఆచరణాత్మక స్మృతికి...**

# ప్రస్తావన

2012 అక్టోబర్ 2న ఏర్పడిన మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి 2017తో అర్థదశాబ్ద ఉద్యమ కార్యాచరణను పూర్తి చేసుకుంది. వివిధ ప్రభావాలు కబళించాలని చూసినా తన స్వతంత్ర పంథాని నిలుపుకుంది. ఈ క్రమంలో రాష్ట్రంలోని విజ్ఞానవేదికలు, ప్రజా సంఘాలు, మహిళ సమాఖ్యల సహకారంతో మత్తు వ్యతిరేక ప్రచారోద్యమాన్ని మరింత ముందుకు తీసుకునిపోయేందుకు చేసే ప్రయత్నంలో భాగంగా ఈ సావనీర్‌ను తీసుకురావడం జరుగుతోంది. కంగాళీ సంఘాల వెంట నడవకుండా, ఏ పార్టీకి బాకా ఊదకుండా నిబద్ధతను నిలుపుకునేందుకు గత ఐదు సం॥రాలుగా సమితి ప్రయత్నిస్తూనే ఉంది. ఈ ఐదు సం॥రాల్లో మూడు జిల్లాస్థాయి సదస్సులు, ఒక రాష్ట్రస్థాయి సమావేశంతోబాటు అనేక ప్రాంతీయ సభలు నిర్వహించడం జరిగింది. అలాగే వివిధ పుస్తకాల్ని ప్రచురించడం జరిగింది. మద్యపాన వ్యతిరేక ఉద్యమానికి దిశానిర్దేశం చూపిన **"మద్యంపై యుద్ధం"** పుస్తకం రాష్ట్రవ్యాప్తంగా అనేకమంది వ్యక్తులకి, వివిధ సంఘాలకి స్ఫూర్తినిచ్చింది. గత సంవత్సరం ఉభయ తెలుగు రాష్ట్రాల్లో గల సామాజిక ఉద్యమకారులయిన మహిళల విలువైన వ్యాసాలతో **'మద్యపానమా? మానవత్వమా?'** అనే అపూర్వ సంకలనాన్ని తీసుకురావడం జరిగింది. నషాముక్తి భారత్ ఆందోళనలో భాగంగా దేశవ్యాప్తంగానున్న ఉద్యమకారులు కొద్దిమంది బస్సు యాత్ర చేసారు. అందులో భాగంగా ప్రముఖ ఉద్యమకారిణి మేధా పాట్కర్ ఆ సంకలనాన్ని సుందరయ్య భవన్, హైద్రాబాద్‌లో ఆవిష్కరించారు. అలాగే మద్యం తదితర వ్యసనాలకు వ్యతిరేకంగా వర్ధమాన కవులు, రచయితలు, సాహితీపరుల రచనలతో ఒక కవితా, కథా, సంకలనం తీసుకొచ్చే ఆలోచన సహితం సమితికి ఉంది. ఈ పనులు చేస్తున్నప్పటికీ, కార్యకర్తల కొరత, కార్యక్రమాల రూపకల్పనలో తత్సారం మొదలైన సమస్యలు సమితికున్నాయి. ఏదేమైనప్పటికీ అయిదు సం॥రాలుగా తన శక్తిమేరకు విస్తరించి కృషి చేయడంలో సమితి విజయం సాధించిందనే చెప్పొచ్చు. పనుల ఒత్తిడి, సరైన స్పందన లోపించడంతో అనుకున్న విధంగా ఈ సావనీర్ రూపొందించలేకపోయాం. చిరుపొత్తంగా మాత్రమే తీసుకొస్తున్నాం. ఈ సమయంలో మనందరి భాగస్వామ్యం మరింత సామాజిక ఆరోగ్యానికి దారితీస్తుందనే ఆశతో...

# 1. వ్యసన వ్యతిరేకోద్యమం - ఒక విశ్లేషణ

– గౌరవ్

ఆధునిక విజ్ఞానశాస్త్రం ఈ దేశ ఛాందసత్వంతో కల్సి మానవాళిలో అధికం చేసిన మూడు ప్రధానమయిన ప్రమాదకర వ్యసనాలున్నాయి.

1) అమానవీయత, 2) అసమానత, 3) అసహిష్ణుత

అప్రజాస్వామిక వినిమయదారీ సంస్కృతి విలయతాండవం చేస్తున్న ప్రస్తుత పరిస్థితుల్లో పై వాటిని గుర్తించి బలహీనపర్చడం ద్వారానే సమాజం సమానత, సహిష్ణుత మానవీయత దిశగా సాగి సార్వజనీనమయిన సంక్షేమం సాధ్యపడుతుంది.

ఆ విషయాన్ని గ్రహించీ వ్యసనాలకి వ్యతిరేకంగా మొట్టమొదట గళాన్ని విప్పి మత్తుపదార్థాల్ని నిషేదించిన వ్యక్తి బుద్ధుడు. జ్ఞాన సాధనకి వ్యసనమనేదెలా విరుద్ధమో బౌద్ధం గుర్తించింది. మహాయాన, హీనయాన, శాఖలన్నీ దీనినంగీ కరించాయి. అంబేద్కర్ స్ఫూర్తితో సాగుతోన్న నవయాన ఉద్యమం ఈ రోజు ఈ సమస్యపై అవగాహన ఏర్పర్చుకోవడం చాలా అవసరం[1].

**"మద్యపానము దుఃఖమును తెలియనీయదనే కారణం చేతనే వైష్ణవ మతస్తులలో వామాచారులు బంధుమరణములలో తుట్టతుద రోజున 'తొల్బక్క'మనే పేరుతో పూర్తిగా త్రాగుతారు. వైద్యశాస్త్ర గ్రంథమగు రోలంబ రాజీయములో దుఃఖము పోవుటకౌషధమేమని ప్రశ్నించినపుడు సురాపానమని జవాబు చెప్పినాడు..."** అంటాడు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి తన కాశీయాత్రలో, అందులో ఆయన ఈ వ్యసనం గురించి ప్రత్యేకంగా "భంగుపానయోగ"మనే విభాగాన్నే కేటాయించి మరీ మొరపెట్టుకున్నారు.[2]

90వ దశకంలో ఉవ్వెత్తున ఎగసిన మద్యపాన వ్యతిరేకోద్యమ విజయంలో భాగంగా ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు వావిలాల నెల్లూరుజిల్లా గ్రామాల్ని సందర్శించీ అక్కడి దళిత బహుజన మహిళల్ని ప్రశ్నించినపుడు **"అప్పుడు తన్నులు తిన్నాం, ఇప్పుడు అన్నం తింటున్నాం"** అని జవాబిచ్చారట[3].

దేశంలోని పేద ప్రజల బతుకుల్ని బాగుపర్చుకోవడానికి ఉపయోగపడే మద్య నిషేధాన్ని, మత్తు పదార్థాల నిషేధాన్ని గురించి పెదవి విప్పకుండా దళిత బహుజనుల

ఆహారమైన 'గోమాంసాన్ని' నిషేధించే మతోన్మాద ప్రభుత్వం ఒకవైపు[4], అధికారంలోనున్న రాష్ట్రాల్లో మద్యం పాలసీకి సంబంధించీ అవగాహన లేకుండా తెలుగు రాష్ట్రాల్లో ఉవ్వెత్తునెగసిన మద్యపాన వ్యతిరేకోద్యమానికి మద్దతివ్వడానికి కూడా ముందుకురాని పార్టీలు మరోవైపు మద్య నియంత్రణ పేరుతో ఇవాళ జాతాలు సృష్టించుకుంటున్నాయి.

చిత్రమేమిటంటే గాంధీ పిలుపునందుకుని స్వాతంత్ర్యోద్యమంలోకి దూకి మద్యపాన వ్యతిరేకోద్యమంలో భాగంగా వందలాది తాటిచెట్లను నరికించడమేకాక అంతెత్తు తాటిచెట్టు నుండి కిందపడి దెబ్బలుతిని కూడా అంత చెట్టూ తిరిగెక్కి దానిపై జాతీయ జెండా ఎగురవేసిన పుచ్చలపల్లి సుందరయ్య సాహసం గురించీ ఆ రోజుల్లో కథలుకథలుగా చెప్పుకోగా[5], అలాంటి వారి గురించి నేటి తరాలకు బొత్తిగా తెలియకుండా పోయింది.

సురవరం ప్రతాపరెడ్డివంటి ఉద్దండుని నుండీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు లాంటి అవిశ్రాంత ఉద్యమకారుడి దాకా ఎంతోమంది మత్తు వ్యతిరేకతకు మద్దతిచ్చినవారుండగా, ఈరోజు వారి పేరు చెప్పుకునే ఏ సంఘమూ వ్యసనాన్ని నిర్మాణాత్మకంగా వ్యతిరేకించడానికి ముందుకొచ్చి నిలవడం లేదు.[6] నాడు అంటే 1934లోనే **"మద్యపాన నిషేధమునకు స్త్రీలు కృషి చేయకుండుట"** లోపంగా తెలుగులో లేఖల రూపంలో రచనల్ని 'శారదలేఖల[7]' పేరిట ప్రచురించిన వరలక్ష్మమ్మగారిలాంటివారు భావించగా, మహిళా చైతన్యం పేరుతో పార్టీలకి బాకాలూదే సంస్థలీరోజు 'మద్యనియంత్రణ'ను కోరడం తిరోగమనానికి సంకేతం.

నెల్లూరు జిల్లాలో మొదలై సంచలనం సృష్టించిన మద్య వ్యతిరేకోద్యమం చిన్నది కాదు. ఉదయగిరి తాలూకా, వరికుంటపాడు మండలం, తోటల చెరువుపల్లి గ్రామానికి చారిత్రక ప్రాధాన్యతుంది. దూబగుంటలో మద్యంపై మంటలు రాజేసుకుంటుండగా ఆ గ్రామంలోని స్త్రీలలో కూడా కుంపటి వేడెక్కింది. కొద్దిరోజుల వ్యవధిలోనే సుమారు 11 మంది యువకులు మద్యం బారిన పడి మరణించడంతో రగిలిపోయిన 32 మంది స్త్రీలు కులమతాలకతీతంగా గ్రామంలోని మద్యం దుకాణాలపై దాడిచేసి తగలబెట్టారు. కాలిబూడిదైన దుకాణాలుండే ఖాళీ ప్రదేశంలో గ్రామస్తులంతా స్వచ్ఛంద శ్రమదానం చేసి ఊర్లో సమిష్టి నిర్ణయాలు తీసుకోడానికీ, సమస్యలు చర్చించుకోడానికి పెద్ద అరుగొకటి కట్టి దానికి "మద్యానికి సమాధి"

అనే పేరు పెట్టుకున్నారు. నాకు తెలిసీ ప్రపంచంలో ఒక భయంకరమయిన వ్యసనానికి భౌతికంగా సమాధి నిర్మించిన ఏకైక చారిత్రక గ్రామమిది[8].

అసూయనేది అతిపెద్ద వ్యసనం. అదున్నవారికి ఏ నివారణోపాయాలు పనిజేయవు. 2012లో అఖిలపక్ష సమావేశంలో ఆవిర్భవించిన 'మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి'కీ, ఆ తర్వాత 2014-15 మధ్యకాలంలో తనని తాను విస్తృతపర్చుకుంటూ రాజమండ్రిలో జరిగిన ఉభయ తెలుగు రాష్ట్రాల సదస్సులో 'వ్యసన వ్యతిరేక ప్రచార సమితి'కి ఒక మానవీయ తాత్విక పునాది ఏర్పర్చడం జరిగింది. ఐనా, సంకుచితత్వాన్ని ఒంటబట్టించుకున్న మిత్రులు నన్నర్థం చేసుకునే చేవలేక ఇప్పటికీ వివిధ ప్రచారాలు చేస్తూ నాపై పడేడవడం కద్దు. ఈ పరిణామాల పై విసుగుచెంది ఆ కార్యక్రమాల్ని తగ్గించుకున్నాను. వ్యక్తి నిర్ణయం సమాజంలోని ఇతరేతర ఉద్యమాలపై దుష్ప్రభావం చూపకూడదనే సంస్కారం కలవాడ్ని కనుక ఇంతకుమించి ఈ విషయంపై ఇంకేమీ వ్యాఖ్యానించదల్చుకోలేదు.

25 మే, 2017న కేరళ రాష్ట్రంలో మొదలెట్టి వరుసగా తమిళనాడు, జార్ఖండ్, బెంగాల్, అస్సాం, అరుణాచల్‌ప్రదేశ్, మేఘాలయా, మిజోరాం, నాగాలాండ్, మణిపూర్, త్రిపుర వంటి రాష్ట్రాల్లో జూన్ 25 దాకా దాదాపు నెలరోజులపాటు చేసిన అధ్యయన పర్యటన ఆయా రాష్ట్రాల్లో సైతం వ్యసనవ్యతిరేకోద్యమాల తక్షణావసరాన్ని గుర్తించడం జరిగింది. 2004లో భారత సైన్యం చేతుల్లో అత్యాచారం చేసి చంపబడ్డ తంజిగమ్ మనోరమ హత్యకి నిరసనగా జూలై 15న ప్రపంచంలోనే అతిపెద్ద సైన్యమయిన ఇండియన్ ఆర్మీని గంగవెర్రులెత్తిస్తూ అస్సాం రైఫిల్స్ క్రౌర్యాన్ని ప్రపంచం ముందు పెట్టి 12 మంది పేద మధ్యతరగతి మహిళలు చేసిన 'నగ్న నిరసన' విషయం అందరికీ తెల్సు, కానీ వారంతా దశాబ్దాలుగా ఈశాన్య రాష్ట్రాల్లో సాగుతున్న వ్యసన వ్యతిరేక ఉద్యమకారులనే సంగతి మాత్రం మనకి తెలీదు[9].

సంకుచితత్వానికి మారుపేరైన సైద్ధాంతిక వారసత్వం ఈ దేశంలో ఆధ్యాత్మిక బానిసత్వాన్ని ఎంతలా అభివృద్ధి చేసిందో వైజ్ఞానిక మూఢత్వాన్ని కూడా అంతలా పెంపొందింపజేసింది. ఈ క్రమంలో అంతరాల నిర్మూలనకు తోడ్పడే ఆత్మీయోద్యమాల అవసరం ఎప్పటికంటే ఈరోజు ఎక్కువుంది. వాటిలో భాగంగా ఉంటూ విస్తృత ప్రజానీకంలో మార్పుకోసం నిజాయితీగా ప్రయత్నించడమే వ్యసన వ్యతిరేక ఉద్యమాల పరిధి, సామాజిక శ్రేయస్సునాశించే వారంతా శక్తి మేరకు వీటిల్లో భాగమై పాలుపంచుకోవడం మనుషులుగా వారి కనీస విధి, సెలవు.

## సంప్రదించిన గ్రంథాలు, వివరణలు :

1. అంకురం, బౌద్ధ వ్యాసాల సమాహారం, బొర్రాగోవర్ధన్, లతారాజా ఫౌండేషన్ ప్రచురణ, హైద్రాబాద్, మార్చి-2017, పేజీ-42, మన పయనం 'మద్య' యుగాలకా? వ్యాసం.
2. కాశీయాత్ర (60 సం॥రాల తర్వాత పునర్ముద్రితం), చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి (తిరుపతి వెంకటకవులు), సంపాదకులు - అక్కిరాజు రమాపతిరావు, సుపధ ప్రచురణలు, హైద్రాబాద్-2002, పేజీలు - 28, 29, 30.
3. అప్పట్లో ఏర్పడిన రాష్ట్రస్థాయి మద్యనిషేధ ప్రచార కమిటీకి వావిలాల అధ్యక్షులు, బాట్టం శ్రీరామ్మూర్తి కన్వీనర్, 23 మంది సభ్యులు. ఈ కమిటీ అధ్యక్షులుగా వావిలాలవారు ప్రభుత్వం ఇస్తానన్న గౌరవ వేతనాన్ని తిరస్కరించడమే కాక ఏడాదిపాటు రాష్ట్రమంతటా విస్తృతంగా పర్యటించి మద్యనిషేధ ప్రచారాన్ని నిర్వహించారు. ఈ అంశంపై విస్తృతంగా అధ్యయనం - పరిశోధన చేసి సమగ్ర నివేదికను ప్రభుత్వానికి అందజేసారు. 1994 గాంధీ జయంతి నుండీ సంపూర్ణ మద్య నిషేదం విధించాలని వావిలాల చేసిన డిమాండ్‌కు ప్రభుత్వం స్పందించకపోవడంతో నిరసనగా మద్య నిషేధ ప్రచార కమిటీ అధ్యక్ష పదవికి రాజీనామా చేసారు. వివరాలకు చూడు - మన వావిలాల, యాతగిరి శ్రీరామ నరసింహరావు, మేడిశెట్టి తిరుమలకుమార్, ప్రచురణ : ఆంధ్రకేసరి యువజన సమితి, రాజమహేంద్రవరం, 1995, పేజీలు - 74, 75.
4. "రామరాయల కాలంలో ఒకసారి కొంతమంది ముస్లింలు అనాలోచితంగా ఒక ఆవుని చంపారు. ఈ సంఘటనను వ్యతిరేకిస్తూ ఆయన తమ్ముడు తిరుమలరాయలు గోవధను నిషేధించాలని ఆందోళన లేవదీసాడు. రామరాయలు ఆ ఆందోళనకారుల్ని సమావేశపర్చి శాంతింపజేయడమే కాకుండా తన ప్రజలయిన ముస్లింల మనోభావాల్ని గాయపర్చకూడదని వాదించాడు. కాని నేటి ఈ ఆధునిక పాలకుల పరిపాలనలోని కౌటిల్యాన్ని గమనించండి. వీళ్ల మనస్తత్వాలు ఎంత దారుణంగా కనిపిస్తాయి!" చూడు - ఆంధ్రుల చరిత్రలో నూతన ఆవిష్కరణలు, టి. రవిచంద్, విశాలాంధ్ర, పబ్లిషింగ్ హౌస్, గుంటూరు 2003, పేజీ-27.
5. చూడు: పుచ్చలపల్లి సుందరయ్య, రచన డా॥ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, విజ్ఞాన్ పబ్లిషర్స్, గుంటూరు, 2003, పేజీ - 27.

6. మద్యపాన సమస్యపై సురవరం మద్యపానం పేరుతో లఘుపొత్తం రాసారు. తర్వాత మద్రాసులో ఒక మిత్రుని కోరికపై దాన్ని 60 పేజీలకు విస్తరింపచేసారు. మళ్ళీ ఆంధ్రజన సంఘం వారి కోరిక మేరకు ముచ్చటగా మూడోసారి మరికొంత పెంచి రాసిచ్చారు. అందులో ఆయన తిరుపతి వెంకటకవులు రచించిన "శ్రవణానందము" లోని వో పద్యాన్ననుసరిస్తూ, సొంతంగా మద్యం వల్ల కలిగే నష్టాల్ని బేరీజు వేసి చెప్తూ,

"కం॥ ధనమా వ్యయమైపోవును
మనమా చురుకుదనము మానును, యశమా
దినదినము క్షీణించును
తనువా చెడిపోవు కల్లు త్రాగుట చేతన్" అంటారు.

చూడు : బహుముఖ ప్రజ్ఞాశాలి సురవరం ప్రతాపరెడ్డి, సంపాదకులు : డా॥ గంటా జలంధర్‌రెడ్డి, సురవరం లఘు నాటికలు, డా॥ తూర్పు మల్లారెడ్డి, జాతీయ సదస్సు విశేష సంచిక, మార్చి 2009, పేజీలు – 70, 71. అలాగే చూడు : కర్మయోగి గాడిచర్ల హరి సర్వోత్తమరావు, రచన : రావినూతన శ్రీరాములు, ప్రచురణ : శ్రీ ప్రకాశం జాతీయ పరిషత్, ఒంగోలు, 2015, పేజీ–48, ఇందులో 1931 ఆగస్టులో నంద్యాల తాలూకాలో మద్యం వేలంపాటల్ని గాడిచెర్ల ఎదుర్కొని ఉద్యమించినట్లు తెలుస్తోంది.

7. చూడు; విఠ్ఠల కీర్తనలు అన్నమయ్యవా?, రచన : మోదుగుల రవికృష్ణ, సంపాదకత్వం డా॥ సి.హెచ్. లక్ష్మణ చక్రవర్తి, పద్మ ప్రచురణలు, గుంటూరు, ఆగస్టు 2014లో **"శారద లేఖలు"లో ప్రతిబింబించిన నాటి స్త్రీ** వ్యాసం, పేజీలు, 105–107.

8. నెల్లూరు జిల్లా మద్యపాన వ్యతిరేకోద్యమం గురించి యింకా సమగ్ర శోధన జరగలేదనేది నా భావన. మేరీలార్డ్స్ అనే స్వీడన్ దేశస్తురాలు ఆ ఉద్యమంపై అక్కడుండీ స్వయంగా పిహెచ్‌డి కోసం ఆ అంశం ఎన్నుకుని లోతుగా అధ్యయనం చేయడమే కాక, పరిశోధన పూర్తయ్యా తిరిగి తన స్వదేశం వెళుతున్న సందర్భంగా గ్రామస్తులందరికీ కృతజ్ఞతలు చెప్పడం కోసం ఒక సభ పెట్టి తనకొచ్చే ఒక నెల స్కాలర్‌షిప్‌ను (దాదాపు 15,000) గ్రామంలో గ్రంథాలయం ఏర్పర్చడానికి విరాళంగా ఇచ్చింది. దౌర్భాగ్యమేమిటంటే ఆ గ్రామంలో యిప్పటికీ ఆవిడ ఆలోచన రూపుదాల్చలేదు. ఆనాటి ఉద్యమంపై సిడాక్ట్ అనే సంస్థ "When Women Unite

(ఆడవాళ్లు ఏకమైతే)" అనే సందేశాత్మక చలనచిత్రాన్ని ఉద్యమంలో పనిచేసిన స్త్రీలచేతనే నటింపజేసి నిర్మించింది. మన దేశంలో ఎప్పుడో మరుగునపడిన ఆ సినిమాను అమెరికాతో సహా సుమారు 53 దేశాలు Educational Kit గా ప్రకటించీ, ఉపయోగించుకుంటున్నాయి. ఈ సినిమా సిడీ కావల్సినవారు అందులో ప్రొడక్షన్ మేనేజర్‌గా చేసిన ప్రస్తుత ప్రజాసైన్స్ వేదిక రాష్ట్ర అధ్యక్షులు చయనం ఆంజనేయ ప్రసాద్ (డా॥ సి.ఎ. ప్రసాద్) గార్ని సంప్రదించవచ్చును. దాదాపు 3 సం॥రాలు కష్టపడి, 800 గ్రామాలు పర్యటించీ, వేలమందిని ఇంటర్వ్యూచేసి నిర్మించిన 80 నిమిషాల ఈ చిత్రం 97లో జపాన్‌లో జరిగిన ఇంటర్నేషనల్ ఫిల్మ్ ఫెస్టివల్‌లో బహుమతిని గెల్చుకుంది.

9. ఆనాడు అత్యంత ధైర్యంగా సైన్యం అమానుషత్వాన్ని బహిరంగంగా ప్రశ్నించీ నగ్నంగా వారి ముందుకెళ్ళి "రండి! సైనికులారా మమ్మల్నీ రేప్ చేయండం"టూ నినదించిన 12 మంది ధీరవనితల్ని కల్సి ఇంటర్వ్యూ చేద్దామనేది ఎప్పట్నుంచో నా కోరిక. విద్యార్థిగా వార్తాపత్రికలో ఆరోజు ఆ వార్త కలిగించిన సంచలనం చిన్నది కాదు. ఆ ఆలోచనలతోనే ఈశాన్య రాష్ట్రాల పర్యటన ప్రారంభించి మణిపూర్ వెళ్లాను. ఐతే, అప్పటికే ఆ 12 మందిలో ఇరువురు మరణించారని తెల్సింది. అదే సమయంలో షిల్లాంగ్‌లోని నేషనల్ బుక్ ఏజన్సీలో అప్పటికే ఆ 12 మందినీ ఇంటర్వ్యూ చేసిన పుస్తకం దొరికింది. ఈ పుస్తకంలో వ్యసన వ్యతిరేక ఉద్యమాల్లో మహిళల పాత్ర చిత్రించడం కనిపిస్తుంది. వివరాలకు చూడు, The Mothers of Manipur, Twelve Women who made history by Teresa Rehman, Published by Zubaan Books, New Delhi-2017.

# 2. భయంకరమైన చీకటి వెలుగుల వ్యాపారం

– కె. శాంతారావు
సాంస్కృతికోద్యమ కార్యకర్త, హైద్రాబాద్.

మత్తు పదార్థాలకు బానిసైన 14 ఏండ్ల బాలుడు కన్నతల్లినే గొంతుకోసి కడతేర్చాడు. హైద్రాబద్ మంగళ్‌హాట్ పోలీస్‌స్టేషన్ పరిధిలోని శివలాల్ నగర్‌లో ఈ ఘటన జరిగింది. తల్లిపేరు రేణుక. (45 సం॥)

పదేళ్ళక్రితం భర్త చనిపోతే చిత్తు కాగితాలు ఏరుకుని అమ్ముకునే వృత్తిలో ఉంటూ కొడుకుని సాకుతున్నది. కొడుకు ఇదే వృత్తిలో ఉంటూ (మధ్యలో చదువు మానేసి) మత్తు పదార్థాలకు బానిసయ్యాడు. రు.200లు కావాలంటూ తల్లితో గొడవపడి, కడకు హత్యచేశాడు. (సాక్షి దినపత్రిక వార్త మే 8, 2017.)

మత్తు మాతృమూర్తిని సైతం బలికొంటుందా? అంటే అవును అనే సమాధానాన్ని ఈ వార్త తెలియజేస్తున్నది.

అదే రోజు అదేపత్రికలో మరోవార్త వచ్చింది. తల్లి కష్టం చూడలేక తనయ బలవన్మరణం.

ప॥గో॥ జిల్లాకు చెందిన జయశ్రీ (19) సినీ దర్శకుడు ఎ. కోదండరామిరెడ్డి నివాసం (జూబ్లీ హిల్స్, హైద్రాబాద్)లో పని మనిషిగా పనిచేస్తున్నది. తన తల్లికి స్వగ్రామంలో జరుగుబాటుకరువైందనే ఆమె హైద్రాబాద్ వచ్చి మరో ఇంట్లో పనిమనిషిగా చేరింది. తన కోసం, తన పెళ్ళికోసం, తన భవిష్యత్ కోసం తల్లి పడుతున్న కష్టాలను చూసి తట్టుకోలేక జయశ్రీ ఫ్యాన్‌కు ఉరి వేసుకుని చనిపోయింది.

పై ఘటనకు పూర్తి విరుద్ధమైన ఘటన ఇది. ఇక్కడ ఆత్మహత్యను సమర్ధించడం కాదు కాని నేటి సమాజంలో నెలకొన్న విభిన్న సంస్కృతీ విలువలకు తార్కాణం. అర్థం చేసుకోవడానికి బుర్రతోపాటు మనసు పెట్టాలి. తగు రీతిలో స్పందిస్తేనే కర్తవ్యం బోధపడుతుంది.

పేదరికం చాలా కఠినమైనది. జీవితాలను తారుమారు చేయడమే కాదు. అసలు జీవితాలే లేకుండా చేస్తుంది అనడానికి ఇలాంటి ఉదంతాలు కోకొల్లలు. కాని వెలుగులోకి వచ్చేవి కొన్నే.

మన సంపదలో ఒక శాతం సంపన్నవర్గం వద్ద 60 శాతం, మిగిలిన 99 శాతం వద్ద 40 శాతం ఉన్నట్టు లెక్కలు చెబుతున్నాయి. ప్రతి ముగ్గురిలో ఒకరు ఇప్పటికే పస్తులతో కటిక దారిద్ర్యం అనుభవించడానికి ఈ భయంకర అసమానతే కారణం.

కాగా ప్రపంచంలోకెల్లా అత్యధిక యువశక్తి గల దేశం మన భారత్. దేశప్రగతికి యువశక్తే పునాది అని వేరుగా చెప్పక్కర్లేదు. ప్రపంచీకరణ నేపథ్యంలో దేశదేశాల్లోని యువశక్తిని నిర్వీర్యం చేసే కుట్రలో భాగంగా సంపన్న వర్గం అశ్లీల, అసభ్య జూద చిత్రాల ఉత్పత్తితోపాటు మత్తు, మాదక ద్రవ్యాల ఉత్పత్తిని పెద్ద ఎత్తున కొనసాగిస్తున్నది. ఇది యావత్ ప్రపంచాన్నే కమ్మేస్తున్న భయంకర చీకటి వెలుగుల వ్యాపారం.

కొన్ని పద్ధతులకు, విధానాలకు కట్టుబడే వెలుగు వ్యాపారం విలువలను కొల్లగట్టగలదు. భ్రమ సంస్కృతిని అద్భుతంగా సృష్టించి కలల వ్యాపారం చేయగలదు. శ్రమ సంస్క ృతిని తుత్తునియలు చేయగలదు. వందల, వేల కోట్ల రూపాయల పెట్టుబడితో సాగే హాలివుడ్, బాలివుడ్, టాలివుడ్ చలనచిత్రాలు, యానిమేషన్ పిక్చర్స్, వీడియో గేమ్స్, ఐపిఎల్ క్రికెట్ మ్యాచింగ్‌లు, బెట్టింగ్‌లు, క్లబ్‌లు, పబ్‌లు, ఫ్యాషన్ పెరేడ్స్, అధునాతన వాహనాలు, ర్యాట్‌రేస్‌లు, రెలిజియన్‌తో సహా అన్నిరకాల పెద్ద పెద్ద ప్రాపగాండా ఈవెంట్స్ మొదలైనవన్నీ ఈ కోవలోకే వస్తాయి.

ఇక్కడ మనిషి పూర్తిగా పరాయీకరణ (ఎలియనేట్) చెంది, తన దేశం నుండి, తన ప్రాంతం నుండి, తన సమాజం నుండి, తన కుటుంబం నుండి, చివరకు తన నుండి తాను వేరుపడతాడు. భోగలాలస జీవితానికై పరుగులిడతాడు. హేతుబద్ధతను, విచక్షణను, ప్రశ్నించే స్వభావాన్ని కోల్పోతాడు. మనిషితనం పోగొట్టుకుని తోటి మనిషి హక్కులను, గుర్తింపును, గౌరవించలేని అప్రజాస్వామ్య స్థితికి నెట్టబడతాడు. ఇందుకోసం సామ్రాజ్యవాద దోపిడీ వర్గం దాదాపు 20 శాతం పెట్టుబడులను ఈ సాంస్కృతిక ఉత్పత్తులపై వెచ్చిస్తున్నది. ఇదంతా బహిరంగంగా చలామణి అయ్యే 'వెలుగు' వ్యాపారమే. అగ్రరాజ్యాలు, చాలా దేశాలు తమ రక్షణాయుధాల ఖర్చుకు సమాంతరంగా ఈ సాంస్కృతిక ఉత్పత్తులకు ఖర్చు పెడుతున్నాయనటంలో ఎలాంటి సందేహం లేదు. ఈ కుట్రలో మనిషి మానసికంగా మాత్రమే నిర్వీర్యుడవుతాడు.

లక్ష్యం లేని మనిషి, వెర్రి పరుగులతో అలసిన మనిషి, భవితపై ఏమాత్రం ఆశ విశ్వాసంలేని మనిషి, కడకు తనపై తనకే నమ్మకం లేని మనిషి భయంతో తీవ్ర మానసిక ఒత్తిడికి లోనౌతాడు. ఆత్మస్థైర్యంతో పరిస్థితులను ఎదుర్కోలేని మనిషి అనివార్యంగా పలాయన వాదంలోకి వస్తాడు. ఏ స్థాయిలో మనిషి ఆ స్థాయిలో వ్యసనాలకు బానిస అవుతాడు.

భోగలాలస జీవితాలకు బానిసైన సంపన్నవర్గం మత్తు మాదక ద్రవ్యాలను సేవిస్తూ ఆధునిక మనిషిగా చలామణి అవుతాడు. విలువలను తల్లక్రిందులుగా చేసి వల్లె వేస్తాడు. పేద మధ్యతరగతి వర్గంలోని మనిషి కష్టాల పరిస్థితిని తట్టుకోలేక ఆ క్రింది స్థాయిల్లోనే మత్తు మాదక ద్రవ్యాలకు బానిసవుతాడు.

సంపన్న వర్గంలోని స్త్రీలకు, యువతకు డ్రగ్స్ వినియోగం గురించి వారికి పెద్దగా నేర్పక్కర్లేదు. అది వారు సృష్టించుకునే వాతావరణమే, కాని పేద మధ్యతరగతి వారిని ఈ ఊబిలోకి దించేందుకు ప్రత్యేకంగా కొత్త వాతావరణం సృష్టించాలి.

బాలకార్మిక వ్యవస్థను, ట్రాఫికింగ్ (బాలికలను, యువతులను సామూహికంగా వ్యభిచార కూపాలకు అమ్మివేయడం), సంపన్న వర్గాల స్వార్ధ ప్రయోజనాలకు అనుగుణంగా మార్చుకోవాలంటే పేదవర్గాల్లోని పేదలను పేదలుగానే ఉంచాలి. మరింతగా పెంచాలి, పేదలు తమకు జరుగుతున్న ఘోరాన్ని, దుర్మార్గాన్ని, దోపిడిని ప్రశ్నించకుండా, ప్రతిఘటించకుండా ఉండాలంటే వారు మానసికంగానే కాక భౌతికంగానూ జీవశ్చవంగా నిర్వీర్యం కావాలి.

అందుకే ఈ మత్తు మాదక ద్రవ్యాల ఉత్పత్తి వ్యాపారం. ఇది చీకటి వ్యాపారమే. నీలిచిత్రాల ఉత్పత్తి కూడా చీకటి వ్యాపారమే. కానీ ప్రపంచీకరణ పుణ్యమా అంటూ పూర్తి బహిరంగమై, అత్యంత నగ్నంగా జడలమర్రిలా విస్తరించుకుంటూ విషసంస్కృతిని విరజిమ్ముతున్నది. పొగాకు గుట్కా ప్యాకెట్‌ల నుండి కొకైన్ హెరాయిన్, బ్రౌన్‌షుగర్ వంటి డ్రగ్స్ యధేచ్ఛగా ఎక్కడ బడితే అక్కడ దొరుకుతున్నాయి. గంజాయి, నల్లమందు, తంబాకు, ఖైనీ, భంగు, గుట్కాల వంటివి సరేసరి.

నగరాలు, పట్టణాలు, పల్లెలు, విశ్వవిద్యాలయాలు కళాశాలలు, పాఠశాలలకు చివరకు ప్రార్థనా స్థలాల్లో కూడ ఇవి నిలయాలుగా మారుతున్నాయి. ఈ విశృంఖలత్వానికి ఎల్లలు లేకుండా పోయింది. నీలి చిత్రాలు సెల్‌ఫోన్‌ల చేతిలోకి వచ్చాయి. లేదా భక్తి, ముక్తి, రక్తి మార్గంలో అన్నీ సాగిపోతుంటాయి. ఎటొచ్చి పేదవారికి కష్టజీవులకు ఇదో ఉచ్చు, ఎలా తప్పించుకోవాలో తెలియదు.

ప్రస్తుతం మన దేశంలో ఏడున్నర కోట్లమంది ఈ డ్రగ్స్‌కు బానిసైనట్లు ప్రభుత్వ అంచనా. ఈశాన్య, వాయవ్య, బంగ్లాదేశ్, పాకిస్తాన్, సరిహద్దు ప్రాంతాల నుండి ఉగ్రవాదంలాగానే ఈ మాదక ద్రవ్యాలు కూడా దిగుమతి అవుతున్నాయని, ఉమ్మడి పోరుతోనే దీనిని తుదముట్టించాలని మన ప్రధానమంత్రి నరేంద్రమోడి ఉవాచ.

అయితే ఈ వ్యాపారాలు చేసేవారంతా ఏ దేశంలోనైనా పాలకవర్గాలతో సన్నిహిత సంబంధాలు కలిగినవారే. దృఢమైన రాజకీయ సంకల్పం లేకుండా ఇది నెరవేరదు. సరికదా పెరుగుతూ పోతుంది.

ఇంత పెద్ద బ్రహ్మరాక్షసిని ఎదుర్కోవాలంటే ఏకైక దిక్కు పౌర సమాజమే. తప్పులు అందరూ చేస్తారు. త్యాగాలు కొందరే చేస్తారు. దేశం కోసం, ప్రజల కోసం ప్రాణత్యాగం చేసిన భగత్‌సింగ్, సీతారామరాజు, కొమరం భీమ్ వంటి పౌరుల సాహసాలను నిత్యం స్మరించుకుంటూ ఆ మార్గంలో యువతను నడిపించడమే నేటి పౌర సమాజ బాధ్యత, ఆవశ్యకత.

ఒక వీరుని మనం స్మరించుకోవడమంటే మనల్ని మనం సాయిధులుగా, చైతన్యులుగా పునర్నిర్మించుకోవడమే.

---

# 3. వ్యసనం (ప్రసంగవ్యాసం)

- డా॥ మలయశ్రీ
శతాధిక గ్రంథకర్త, కరీంనగర్

మనకు రకరకాల అలవాట్లు ఉంటవి. వాటిలో కొన్ని మంచిని, కొన్ని చెడువి, మంచి వాటితో బాధలేదు కాని, చెడు అలవాట్లతోనే ప్రమాదం.

అలవాటు అనేది తెలుగు పదం, దానికి సమానార్ధక సంస్కృత పర్యాయపదం 'వ్యసనం' మంచి వ్యసనానికి సద్వ్యసనం అనే మంచి వాడుకలో లేదు కాని, చెడు వ్యసనాన్ని 'దుర్వ్యసనం' అంటున్నారు. వ్యసనానికి ముందు మరే అనే ఉపసర్గ ప్రిఫిక్స్ చేరి ఈ శబ్దం ఏర్పడింది. ప్ర, పరమ, అవ, ఆప, ఆధి, అబి, దుర్, నిర్, వి, సం, సు, కు, సత్... అని ఉపసర్గలు ఇరవై సంస్కృత పదాలకు ముందు వీటిని చేర్చి పండితులు. ఉ॥ అభ్యున్నతి, అత్యధికం, అవలక్షణం, అపశబ్దం, సంయోగం, విమల మొ॥ తెలుగు పదాలకు ఇవి లేవు. రావు, కాని, నిక్లజ్జు, నిస్సిగ్గు అని కొందరు నిర్భయంగా వాడుతున్నారు. కానీ జీవనది వలె సజీవ భాష మారుతూనే వుంటుంది. మారనిది మత భాష - మృతభాష. సరి! గ్రంథాల్లో తప్ప అది జన వ్యవహారంలోలేనిది.

మనం భాషను గురించి కాదు. ప్రస్తుతం వ్యసనాల గురించి మాట్లాడుకుంటున్నాం. మంచి - చెడు అలవాట్లు ఉంటాయని తెల్సిందికదా,

ఒకడు ముఖం కడుగనిదే టీ, కాఫీ, మంచినీరు ఏది తాగడు. ఆది నుంచి అలవాటే. కాని, కొందరు ప్రొద్దున వేడి తేనెతో, శీతల మత్తు పానీయమో త్రాగనిదే పడక దిగరు. ఇది తప్పక దురలవాటే (తప్పు ప్రయోగం...) అంటే దుర్వ్యసనం.

మన పూర్వులు - వెలది (వ్యభిచారం), పానము (మద్యం), జూదము, వేట, దొంగతనం మొ॥ సప్త (7) దుర్వ్యసనాలను పేర్కొన్నారు. అది చెడుదైతే దుర్వ్యసనం.

ముఖ్యంగా - ధూమపానం (పొగాకు), మద్యపానం (మత్తు పదార్థాల సేవనం) జూదం - మట్కా, హార్స్‌రేస్, చీట్లాట, ఆటల బెట్‌లు కూడా. ఇవే కాక వ్యభిచారం, కూడా దుర్వ్యసనమే.

ఒంటరిగా బలహీనులు కూడా సాగించేవి ధూమపానం, మద్యపానం.

ఇవి అనుకరణల వల్లనో, ఆనందం కోసమో, ఆర్భాటాల / గొప్పతనం కోసమో మొదట మొదలైనవి. తర్వాత క్రమంగా వీడని వ్యసనాలౌతవి. వీటివల్ల ఆ వ్యక్తులకే నష్టం అనుకోవద్దు. వాటివల్ల వ్యక్తికి అర్థం, ఆరోగ్యం, సమయం, గౌరవానికి నష్టం. అదే కాక, ఆ వ్యక్తి కుటుంబానికి, సమాజానికి నష్టం-కష్టం.

ఈ దుర్వ్యసనాలు బలహీనత కదలిపోవు. వాళ్ళు తమ తాత్కాలిక ఆనందం – తృప్తిని మాత్రమే కోరుకుంటారు. అందుకే వీటిని వదలుకోరు. అందుకు ప్రయత్నించరు. ధైర్యం వివేకం కలవారు ఏదో కారణంగా దుర్వ్యసనాలకు లోనైనా, తర్వాత తమ తప్పు తెలుసుకుని స్థిర సంకల్పంతో వీటిని వదులుకుంటారు.

పాలు, పళ్ళ రసాలు ఉండగా పాడు మద్యమెందుకు? దానితో తనకు అనారోగ్యం, కుటుంబానికి ఆర్థిక నష్టం. మద్యం మత్తులో మతితప్పి తాగుతూ నానా యాగీ చేస్తే సమాజానికి కష్టం. మద్యం ధర కూడా అధికం. స్వలాభేచ్ఛతో కొందరు వ్యాపారులు స్వదేశీ విదేశీ మద్యాల కల్తీ చేస్తున్నది. ప్రమాదకర పదార్థాల మేళనం వల్ల వాటిని సేవించిన వ్యక్తులకు సత్వరం రోగప్రాప్తి – నిజం.

దానితో వైద్యం ఖర్చులు, శారీరక బలహీనం, వృధా ధన వ్యయం, ఆయుష్షు క్షీణం.

ధూమపానం – పొగాకు వస్తువులు, బీడీలు, సిగరెట్టు, జర్దాలు మద్యపానం వలెనే నష్ట కారకాలు. మద్యంలో ఆల్కహాల్ ఉంటే పొగాకులో నికోటిన్ అనే విష పదార్థముంది. మొదట వాటి మత్తు గమ్మత్తుగా అనిపించినా, రానురాను వ్యసనాలై బతుకుల చిత్తు చేస్తవి. పొగాకు రాకముందు మనదేశంలో గంజాయి ఆకు వాడేవారు.

మద్యపానాన్ని నిషేధించినందున ముస్లిం దేశాల్లో, నల్లమందు, చరస్, కొకైన్, బ్రౌన్ షుగర్ వంటి మత్తు పదార్థాల వాడుక అలవాటైంది. అక్రమ వ్యాపారంతో ఇవి దేశాలు మారుతూ మన దేశంలోనూ ఉన్నత విద్యావంతులైన యువతీ యువకులకు అలవాటై నిర్వీర్యపరుస్తున్నవి.

ప్రజలు – ప్రభుత్వం వీటిని సత్వరం నిషేధించి జనతకు దేశానికి ఉపకరించవల్సి ఉంది.

ముఖ్యంగా దుర్వ్యసనాలకు లోనైన వారు, ఇది మారనిది – తమ తలరాత, అని అనుకోక గట్టిగా ప్రయత్నిస్తే వాటిని వదులుకొని బాగుపడవచ్చు, వ్యసనాలకు బానిసలైన బలహీనులను వారి మిత్రులు, కుటుంబ సభ్యులు డాక్టర్లకు చూపితే లాభముంటుంది. కావల్సింది ప్రభుత్వ నేతల చిత్తశుద్ధి, మన సత్ సంకల్పం. అశ్రద్ధ ఎన్నో అనర్థాలకు మూలం, మనం సదా సదాలోచనలో జాగరూకులమై ఈ దుర్వ్యసనాలు వదులుకుందాం. మన ఇరుగుపొరుగు వాళ్ళు వీటికి లోను కాకుండా తోడ్పడుదాం.

సర్వే సుజనాః సుఖినోభవంతు!

---

# 4. డ్రగ్స్ మత్తులో ప్రభుత్వం

– రంగనాయకమ్మ
ప్రముఖ రచయిత్రి, హైద్రాబాద్

మత్తులో వున్న వాళ్ళకి వాళ్ళేం మాట్లాడుతున్నారో, ఏం చేష్టలు చేస్తున్నారో, తెలీదు. మత్తు, చిన్నదా పెద్దదా అని కాదు; ఎంతది అయితే అంత మాటలూ, అంత చేష్టలూ సాగుతాయి.

ఈ మధ్య, వార్తా సమాచారం అంతా విసుగెత్తించేస్తోంది! పత్రికల్ని అయితే ఒకటి రెండు పెద్ద వార్తలు చూసి వాటిని పక్కన పడెయ్యొచ్చు. రేడియో అయితే, దాన్ని కూడా తేలిగ్గా తప్పించుకోవచ్చు. టీవీలైతే, స్వయంగా చూడని వాళ్ళకి కూడా, వాటిని వదలని మేళం ఇంట్లో తిరుగుతూ వుంటే, వాళ్లు వదలక చూసే ప్రతీ వార్తనీ మన దాకా సరఫరా చేస్తూ వుంటారు. కళ్ళయితే మూసుకుంటాం గానీ చెవులేం మూసుకుంటాం?

టీవీలు లేని, పత్రికలు లేని, రేడియో ఫర్వాలేదు – అంత చిరాకెత్తించదు, అటువంటి వార్తాలోకం ఏదైనా వస్తే గానీ, ఉన్నట్లుండి వచ్చి పడే హఠాత్ వార్తలతో గందరగోళ పడకుండా వుండలేం.

డ్రగ్స్ అట! మత్తు అట! ఇవేవో గొప్ప వార్తలు వచ్చి పడ్డాయి. ఇదేం కొత్త? ఇన్నాళ్ళ నించీ మత్తుల మాట ఎరగమా? ఊళ్ళ నిండి కిక్కిరిసి వుండే చుట్టలూ, బీడీలు, సిగరెట్లూ, సారాలూ, గుర్రప్పందాలూ, గుళ్ళూ గోపురాలూ, లాటరీలూ, జాతకాలూ, జ్యోతిష్యాలూ, ఇవన్నీ మత్తులు కావూ? మనసు మత్తులు వేరూ, శరీరాల మత్తులు వేరూనా? మనసులు, శరీరాల్లోవి కావా?

"మత్తు, మత్తు" అంటూ ఇప్పుడేదో సరికొత్త విషయం అయినట్టు డ్రగ్స్‌ని పట్టుకుందేమిటి ప్రభుత్వం? ఇది కాస్త ఖరీదైన, బరువైన మత్తు అయితే, డబ్బుతో బలిసి వున్న వాళ్ళ మత్తు అది. వాళ్ళందరూ చదువులూ సంధ్యలూ వుండే వాళ్ళే. వాళ్ళ పిల్లలు నాశనం అవుతారని వాళ్ళకి తెలీదా?

'డ్రగ్స్' పేరుతో పోరాటం మొదలుపెట్టిన ఈ ప్రభుత్వాలే కదా, ఊరూరా, వందల, వేల లక్షల తాగుడు దుకాణాలు నడుపుతున్నాయి?

ఎవరు ఏ వీధిలో, ఏ సందులో బతుకుతోన్న వాళ్ళయినా, ఆ కొంపల నించి బైటికి పది అడుగులు వేసి చూడండి! అక్కడ రోడ్డుకి ఇటూ అటూ కూడా కనపడతాయి. ప్రభుత్వ సారా దుకాణాలు! ఏ సిటీలో అయినా, ఆ దుకాణాల సంఖ్యని లెక్క కడితే, ఆ లెక్క వేలని దాటిపోకుండా వుంటుందా?

తాగుడులో వంద రకాలో, వెయ్యి రకాలో వుండొచ్చు. ఏ రకాన్ని తీసుకున్నా, అది మత్తు కాదా? ఆ మత్తుతో సర్వనాశనం అయిపోయిన సంసారాల్లో హత్యలు, ఆత్మహత్యలు, పిచ్చెత్తిపోయే పిల్లలు, బిచ్చగాళ్ళుగా మారే వ్యక్తులు, వ్యభిచారాలే బ్రతుకుదెరువులై పోయే ఆడవాళ్ళు ఎన్నెన్ని జరిగిపోతున్నాయి? ఈనాడు డ్రగ్స్ మీద వీరత్వం చూపే శాఖ ఏ ప్రభుత్వ శాఖో తెలుసా? ప్రజల్ని తాగుబోతులుగా తయారుచేసే శాఖ ఒకటి ప్రభుత్వంలో వుంది. "ఎక్సైజ్ శాఖ" అనీ, "ఆబ్కారీ" శాఖ అనీ, అంటారు దాన్ని. దాని కర్తవ్యం ఏమిటి? – తాగుడు వ్యాపారాన్ని నిరంతరంగా, నిరాటంకంగా నడపడం! సారాలూ, విస్కీలూ, బ్రాందీలూ, ఇంకా ఏవేవో పేర్ల మత్తు అమ్మమని ప్రైవేటు పెట్టుబడుదారుల్ని ప్రోత్సహించడం. జనాలు ఎంతెంతో తాగుబోతులైతే, వాళ్ళ సంసారాలూ, పిల్లలూ ఎంత నాశనం అయితే, ప్రభుత్వానికి పన్నులుగా అంత ఆదాయం అందుతుంది. ఆ ఆదాయం ఎందుకు? అదీ చెప్పుకోవాలా? "రాజకీయాలు" అంటూ ప్రభుత్వంలోకి ఎందుకు దిగుతారు? ఆ ఆదాయం కోసమే! ప్రభుత్వానికి వచ్చే మొత్తం ఆదాయంలో 5వ వంతు ఆదాయం, కొన్ని వేల కోట్లుగా, "తాగుడు" ద్వారానే, కేవలం లిక్కర్ పోలసీ ద్వారానే వస్తుందని అనేక రాష్ట్రాల్లో లెక్కలు తెలియజేస్తున్నాయి.

డ్రగ్స్ వ్యసనం, ఒక మహమ్మారే కావచ్చు. ఆ వ్యసనంలో చిక్కుకున్న వాళ్ళు ప్రభుత్వాన్ని, "మీరు చట్టబద్ధంగా నడిపే సారా వ్యాపారం మాట ఏమిటి?" అని అడిగితే, దాని జవాబు ఏమిటి?

మహా అయితే అది, "నోరు ముయ్యి! అది నా ఇష్టం. నేను ప్రభుత్వాన్ని! నన్ను అడుగుతావా?" అంటుంది.

ప్రభుత్వం, 'పాలన' చేసేది ఎవరిమీద? "ప్రజల మీద" అని అది చెపుతుంది. ప్రజలు కూడా దాన్ని అంగీకరిస్తారు. అలాంటప్పుడు ప్రజలకు, తమ సందేహాల్ని, బైట పెట్టే హక్కు వుంటుంది.

తాగుడు చట్టబద్ధం! చుట్టా, బీడీ, సిగరెట్లు, చట్టబద్ధం! లాటరీలూ, గీటరీలూ, చట్టబద్ధం! దెయ్యాల్నీ, భూతాల్నీ చూపించే సినిమాలు చట్టబద్ధం! నెత్తిమీద జుట్టు వున్నన్ని చట్టబద్ధాలు ప్రజల్ని మత్తులో ముంచేసి వుంచుతోంటే, వాటి మాట ఎత్తకుండా డబ్బుతో పులిసిన వాళ్ళు వాడే మత్తు ఒక్కటీ చట్ట వ్యతిరేకతా?

ప్రభుత్వం ప్రోత్సహించే "మతం మత్తు" కన్నా ఘోరమా డ్రగ్స్ మత్తు? భూముల నిండా మనుషుల నివాసాలకు అవకాశాలు లేని గుళ్ళ మత్తూ, చంటి బిడ్డలకు తిండి లేకుండా రాతి గుళ్ళల్లో రాతి బొమ్మల ముందు వందలాది పళ్ళాలతో ఆహారాల మత్తూ, స్వామివార్ల వందలాది ఎకరాల కుటీరాల మత్తూ మనసుల్ని ఆక్రమించే ఈ మత్తుల కన్నా నేరమా కొత్త మత్తు మందు?

ఒక ముఖ్యమంత్రి, తను ఇంకా ముఖ్యమంత్రి కాక ముందే, తను కోరే రాష్ట్రం రాక ముందే, "రాష్ట్రం వస్తే తిరపతి దేవుడికి కొన్ని కోట్లతో కిరీటాలిస్తా"

అని మొక్కుకోవడమా? ఆ మొక్కు మొక్కినప్పుడు, ఆ వ్యక్తి ఒక సాధారణ పౌరుడు. తను మొక్కుకుంటే, తన డబ్బుతో తను మొక్కు చెల్లించుకోవాలి. ప్రభుత్వ ఆదాయంతో మొక్కు చెల్లించగలిగితే, అది ఆ వ్యక్తి మొక్కు చెల్లింపు అవుతుందా? అటువంటి మొక్కులు చాలామంది మొక్కి వుంటారు. ఆ మొక్కులన్నీ తీర్చడానికి వాళ్ళందరికీ ప్రభుత్వాదాయం అందుతుందా?

"మొక్కు" కూడా మత్తే. ఎవరి మొక్కు వాళ్ళు చెల్లించుకోవాలి. బతకమ్మ, ఒక మత్తు, బోనాలు, ఒక మత్తు! ఎవళ్ళ మత్తుని వాళ్ళు స్వయంగా తీర్చుకోవాలి. ప్రభుత్వాదాయాన్ని మొక్కుల మత్తుల కోసం ఖర్చుపెట్టే హక్కు ఎక్కడి నించి వచ్చింది?

దేశంలో వున్న సమస్త మత్తులకూ ఆహ్వానాలూ, సమర్ధతలూ, చట్టబద్ధతలూనా? ప్రజల్ని దేనికీ ఎదురు తిరగనివ్వకుండా చేసే ప్రభుత్వాల రాజకీయ ఎత్తుగడ ఇది!

ఒకానొక మత్తు ఒక్కటే నేరమూ, దోషమూ, అవుతుందా? "అది చట్టబద్ధంగా నిషేధం కదా?" అంటారా? అందుకే అడిగేది, "ఏ మత్తులూ నిషేధాలు కానప్పుడు, ఈ మత్తు ఒక్కటీ నిషేధం ఎలా అవుతుంది?" అని!

ప్రభుత్వం ఇష్టం ప్రభుత్వానిది అయితే, ప్రజల ఇష్టం ప్రజలది అవుతుంది. ప్రశ్నిస్తారు. చర్చిస్తారు. న్యాయం దొరక్కపోతే తిరస్కరిస్తారు.

ప్రభుత్వానికి కావలసింది పన్నుల పేరుతో ఆదాయం; అంతే కదా? తాగుళ్ళని నిలబెట్టి వుంచేది ఆదాయం కోసమే కదా? డ్రగ్స్‌ని కూడా అందుకే ఉపయోగించుకోండి! కావలసినంత ఆదాయం సంపాదించుకోండి! మంత్రుల జీతాలు వందల రెట్లుగా పెంచుకోండి!

మీరు చాలా ఉత్తములైతే, నిర్దోషులైతే, డ్రగ్స్ వ్యసనాల వాళ్ళ కోసం, "అయ్యో, ఆ వ్యసనాలు వొద్దు! పిల్లలు నాశనం అవుతారు" అని ప్రచారం చేసి ఆ వ్యసనాన్ని మాన్పించండి!

కానీ, రెండు మూడేళ్ళ పసికందులు బోరింగుల్లోకి కూలిపోయి, స్పృహలు తప్పి భీతితో ప్రాణాలు విడుస్తోంటే, ఆ బోరింగుల్ని అలా తెరిచి వుంచిన దోషుల్ని ఏమీ ఆపలేని ప్రభుత్వం, ఒక మత్తు మందు మీదకి పోరాటం ప్రారంభించిందా? ప్రజల క్షేమం కోసం ఏదో చేసేస్తోందని ప్రజల్ని మత్తులో ముంచాలనే ఎత్తుగడతో గాక, ఇంకేదైనా అర్థం వుందా దీనికి? తాగుళ్ళని ప్రోత్సహించే శాఖ వాళ్ళకి, ఒక మత్తు మందు మీద ఇంతింత ఆగ్రహ జ్వాలలు రేకెత్తుతున్నాయి!

అనేక రకాల మత్తుల్ని స్వయంగా, చట్టబద్ధత పేరుతో జనాల మీద రుద్దే ప్రభుత్వాలు గంజాయి వంటి మత్తు మందుల మీద మాత్రమే జనాల దృష్టి మళ్ళించి 'ఎవర్నీ వదిలేది లేదు' అని ఆత్మ స్తుతి చేసుకుంటే అది ప్రభుత్వాల కపట నీతికి నిదర్శనం!

(25 జూలై, 2017, ఆంధ్రజ్యోతి పత్రిక సౌజన్యంతో)

---

# 5. సామాజిక ఉద్యమంగా మద్య వ్యతిరేక ఉద్యమం

- వి. లక్ష్మణరెడ్డి
రాష్ట్ర కన్వీనర్ : మద్య నియంత్రణ ఉద్యమ కమిటి, గుంటూరు

ఆంధ్రప్రదేశ్‌లో 1990 దశాబ్దంలో సంపూర్ణ అక్షరాస్యత ఉద్యమం 23 జిల్లాలలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల సహకారంతో భారత జ్ఞాన విజ్ఞాన సమితి, జన విజ్ఞాన వేదికల కృషితో బాగా జరిగింది. అక్షరాస్యత ఉద్యమంలో మహిళలు ముందున్నారు. ప్రతిరోజు సాయంత్రం 6 గంటల నుండి 9 గంటల వరకు అక్షరకేంద్రాలలో జరిగే బోధనలో స్త్రీలు అధిక సంఖ్యలో పాల్గొని సామాజిక సమస్యలపై అధ్యయనం చేసారు. ఇందులో భాగంగా సీతమ్మ కథ మహిళలో ప్రేరణ కల్గించింది. సీతమ్మ తమ గ్రామంలో అన్ని సమస్యలకు మూలాధారమైన మద్యానికి వ్యతిరేకంగా ఉద్యమంచి వారి గ్రామ మహిళలకు యువతను కలుపుకొని సీతమ్మ తన గ్రామంలో మద్యం లేకుండా చేయ కలిగింది. ఈ పాఠాన్ని స్ఫూర్తిగా తీసుకొన్న నెల్లూరు జిల్లా దూబగుంట గ్రామస్తులు మహిళల ఆధ్వర్యంలో మొదట సారాకు వ్యతిరేకంగా అనంతరం సంపూర్ణ మద్యనిషేధానికి ఉద్యమించారు. 23 జిల్లాలలోని అక్షరాస్యత ఉద్యమనేతలు, దూబగుంట రోశమ్మ, వావిలాగ గోపాలకృష్ణయ్య, ఆనాటి జిల్లా కలెక్టర్ కె. రాజు, కార్యకర్తలు, మహిళా సంఘనేతలు, ఈనాడు దినపత్రిక, గవర్నర్ కృష్ణకాంత్ మొదలైన వారి సహకారంతో సంపూర్ణ మద్య నిషేద ఉద్యమం రాష్ట్రమంతటా వ్యాపించింది. స్వర్గీయ నందమూరి తారక రామారావు తన ఎన్నికల మేనిఫెస్టోలో సంపూర్ణ మద్య నిషేధాన్ని అమలు చేస్తానని ప్రకటించి, అధికారంలోకి రాగానే చిత్తశుద్ధితో సంపూర్ణ మద్య నిషేధాన్ని అమలుచేశారు. ఆ రెండు సంవత్సరాల కాలంలో నేరాలు, హత్యలు, అత్యాచారాలు, దోపిడీలు గణనీయంగా తగ్గాయి. బడి ఈడు పిల్లలు బడికి వెళ్ళడం ప్రారంభించారు. పేదల ఇళ్ళలో సంతోషాలు వెల్లివిరిసాయి. కుటుంబ కలహాలు తగ్గాయి. పేదలు మద్యంపై హెచ్చించే డబ్బును పోషక పదార్థాల కొనుగోలుకు, విద్య, వైద్య రంగాలకు వినియోగించారు. డా॥ నందమూరి తారకమారామావుకు వెన్నుపోటు పొడిచి అధికారంలోకి వచ్చిన నారాచంద్రబాబునాయుడు కుంటిసాకులు చెప్పి, సంపూర్ణ మద్య నిషేధాన్ని ఎత్తివేసి బెల్ట్‌షాపులకు శ్రీకారం చుట్టారు. ప్రజల చెంతకు పాలనకు బదులు ప్రజల చెంతకు మద్యాన్ని చేర్చారు. మద్యనిషేధ ఉద్యమంలో కీలకపాత్ర పోషించిన నాటి గవర్నర్ కృష్ణకాంత్, ఈనాడు అధినేత రామోజీరావు ప్రేక్షకపాత్ర

పోషించారు. వామపక్ష పార్టీలు మిత్రపక్షమైన తెలుగు దేశానికి ఇబ్బంది కలుగుతుందని మద్య వ్యతిరేక ఉద్యమానికి తిలోదకాలు ఇచ్చారు.

ప్రస్తుతం ప్రపంచంలో 15 ముస్లిం దేశాలలో ప్రొహిబిషన్ అమలులో వుంది. మన దేశంలో గుజరాత్, బీహార్, మణిపూర్, నాగాలాండ్ రాష్ట్రాలలో ప్రొహిబిషన్ అమలులో వుంది. మనకన్నా వెనుకబడి వున్న బీహార్‌లో నితీష్‌కుమార్ ప్రొహిబిషన్‌ను జయప్రదంగా అమలు చేయడం వలన పేద వర్గాల జీవన ప్రమాణస్థాయి పెరుగుతుంది. నేరాలు తగ్గుతున్నాయి. రోడ్ ప్రమాదాలు తగ్గాయి.

1995 నాటి నుండి నేటి వరకు వచ్చిన ప్రభుత్వాలు ఏవీ మద్యవ్యతిరేక ఉద్యమాన్ని బలోపేతం చేయటానికి సహకరించకపోగా మద్యం అమ్మకాలను ఆదాయవనరుగా చూశాయి. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో లక్షకు పైగా అనధికార బెల్ట్‌షాపులను పెంచాయి. ఎన్నికల సందర్భంలో అధికారంలోకి రావటానికి మద్య నిషేద ఉద్యమాన్ని ఉపయోగించుకున్నారు. అధికారంలోకి రాకముందు ఎన్నికలలో దశలవారీగా మద్య నిషేదమని పేర్కొంటూ అధికారంలోకి వచ్చిన తర్వాత దశలవారీగా మద్యం అమ్మకాలను పెంచారు. పేద వర్గాలు పేదలుగా వుండాలంటే మద్యం అలవాటును పెంచడమే ఏకైక మార్గమని ప్రధాన రాజకీయ పార్టీలు గుర్తించాయి. ఎలాంటి త్యాగాలు చేయకుండా కేవలం డబ్బు సూట్‌కేసులతో అధికారంలోకి రావాలనుకునే ప్రజా ప్రతినిధులకు ఓట్లకు అమ్ముడుపోయే పేదవారు అధిక సంఖ్యలో వుండాలి. అందుకే మద్యాన్ని ప్రోత్సహిస్తున్నారు.

జాతీయ, రాష్ట్ర రహదారుల ప్రక్కనున్న మద్యం షాపులను సంపూర్ణంగా తొలగించమని సుప్రీంకోర్టు చారిత్రాత్మకమైన తీర్పును ఇచ్చినా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రాష్ట్ర రహదారులను జిల్లా ప్రధాన రోడ్లగా పేరు మార్చి మద్యం షాపులను యధావిధిగా రహదారుల ప్రక్కన కొనసాగిస్తూ ప్రతిరోజు రోడ్ ప్రమాదాలకు అవకాశమిస్తుంది.

వ్యసనం ప్రజలకు ఎంత దూరంగా వుంటే అంత తగ్గుతుంది. వ్యసనం ప్రజలకు ఎంత దగ్గరగా వుంటే అంత పెరుగుతుంది. పేద ప్రజలను పెంచారు. మద్యం ఉత్పత్తిని పెంచారు. బార్ల సంఖ్యను పెంచారు. టూరిజం కేంద్రాలుగా మద్యాన్ని ఎక్కువగా అమ్మటానికి ప్రయత్నిస్తున్నారు. రూ.5 లు విలువచేసే మద్యాన్ని రూ.80లకు అమ్ముతున్నారు.

నేడు ఆంధ్రప్రదేశ్ మద్యంపై ఎక్సైజ్ ఆదాయం 14 వేల కోట్లు మద్యంపై అమ్మకపు పన్ను ద్వారా మరో 11 వేల కోట్లు రాష్ట్ర ప్రభుత్వం ఆర్జిస్తుంది. రాష్ట్ర ప్రజానీకం దాదాపు 40 వేల కోట్ల రూపాయలను ఆరోగ్యాన్ని హరించే, కుటుంబాలను విచ్ఛిన్నం చేసే, అనేక అనర్థాలకు హేతువైన మద్యానికి ఖర్చు చేస్తున్నారు. ప్రజలు తాగుతూ వుంటేగాని ప్రభుత్వం నడవలేని పరిస్థితికి తెచ్చారు. గుజరాత్‌లో గత 65 సం॥ల నుండి సంపూర్ణ మద్య నిషేధం అమలులో వుంది. ఒక్క రూపాయి కూడా ఎక్సైజ్ ఆదాయం లేకపోయినప్పటికి ఆంధ్రప్రదేశ్‌కన్నా అన్ని రంగాలలో ముందుంది.

**తక్షణ కర్తవ్యాలు :**

- ఆంధ్రప్రదేశ్‌లోని బెల్ట్‌షాపులన్నింటిని సమూలంగా తొలగించాలి. రెవిన్యూ, పోలీస్, ఎక్సైజు సిబ్బందిని బాధ్యులుగా చేయాలి.
- డిఅడిక్షన్ కేంద్రాలను అన్ని డివిజన్ స్థాయి ఆస్పత్రులలో ఏర్పాటు చేసి వ్యసన పరులను గుర్తించి, వారికి ఉచితంగా చికిత్స నందించాలి.
- మద్య విమోచన ప్రచార కమిటీలను ఉద్యమకారులతో గ్రామస్థాయి నుండి రాష్ట్ర స్థాయి వరకు ఏర్పాటుచేసి, ఎక్సైజ్ ఆదాయంలో కనీసం ఒక్క శాతం కేటాయించి, మద్యం దుష్ప్రభావాలపై విస్తృతంగా ప్రచారం నిర్వహించాలి. త్రాగుడు తప్పు అనే భావజాలాన్ని ప్రజలలో పెంచాలి.
- బడి, గుడి, నివాస ప్రాంతాల వద్ద వున్న మద్యం షాపులను, బార్లను తొలగించాలి.
- మద్యం అమ్మకాలను ఆదాయ వనరుగా చూడరాదు.
- ఆంధ్రప్రదేశ్‌లో నున్న అన్ని రాజకీయ పార్టీలు, మహిళా సంఘాలు, స్వచ్ఛంద సంస్థలు, ప్రజా సంఘాలు అన్నీ ఏకమై ఐక్యంగా మొదట మద్య నియంత్రణ కోసం అనంతరం సంపూర్ణ మద్య నిషేధం కోసం ఉద్యమించాలి. ఆంధ్రప్రదేశ్‌ను మద్యాంధ్రప్రదేశ్‌గా మారకుండా నివారించాలి.

---

# 6. అలవాట్లు - వ్యసనాలు - పర్యవసానాలు

– డా॥ సి.ఎ. ప్రసాద్
రాష్ట్ర అధ్యక్షులు : ప్రజా సైన్స్ వేదిక, సింగరాయకొండ

చాలా సంవత్సరాల క్రితం ఒక తెలుగు సినిమాలోని పాట నాకు గుర్తుకొస్తున్నది... "పిడికి మించిన హృదయంలో – కడలిని మించిన ఆశలు దాచెను... వేదికలెక్కెను – వాదము చేసెను... త్యాగమే మేలని బోధలు చేసెను." అని హీరో మనిషి గొప్పతనం గురించి పక్కనే వున్న హీరోయిన్‌కు ఘంటసాల గారి గొంతుతో వివరిస్తూంటాడు, అప్పుడా హీరోయిన్ స్పందన సుశీలమ్మ గొంతుతో : "ఐనా మనిషి మారలేదూ – అతని కాంక్ష తీరలేదు" అని కవిగారు, సినిమా దర్శకులు చెప్పిస్తారు. అలవాట్లు చేసుకోడానికి – ఆ అలవాట్లు వ్యసనాలుగా మారిపోవడానికి, కొన్ని అలవాట్లు దురలవాట్లుగా సమాజంలో చెప్పడానికి గానీ, ఈ సోకాల్డ్ అలవాట్లు మనిషిని పతనపు అంచుల్లోకి నడిపించడానికి – వీటన్నింటికీ కారణం – మనిషి – అతని వైఖరి అని చెప్పవచ్చును.

ఈ అలవాట్లు / వ్యసనాలు యిప్పటి సమాజంలోనే మొదలైనాయి అనుకుంటే పొరబాటే, ప్రాచీన కాలంలో దేవతలు కూడా సురాపానం చేసేవాళ్ళని మనం చదివాము. ఈ సురాపానం రాక్షసులలో కూడా ఎక్కువ అలవాటే వుండేదని, రాక్షస గురువు శుక్రాచార్యుడు కూడా ఈ వ్యసనానికి బానిసగా మారి తర్వాతనే మద్యపానానికి వ్యతిరేకంగా శాపమిచ్చాడని మనం చదువుకున్నాం కదా? మహాభారతంలో ఎందరికో ఈ అలవాట్లు వ్యసనాలుగా మారి చరిత్రలో నిలిచిపోయారో గుర్తున్నదా? మన ధర్మరాజు గారి వ్యసనం వలన రాజ్యం, తమ్ముళ్ళు, ఆస్తులతో పాటుగా భార్యను కూడా పోగొట్టుకున్న మహా వ్యసనపరుడు ఆయన కదా? విరాటపర్వంలో కీచకుడు ఆయనతోపాటుగా ఆయన సోదరి మహారాణి సుధేష్ణ ఏమన్నదో గుర్తు చేసుకుందామా? "నా మందిరంలో వున్న "మదిర" మంచి క్వాలిటీ వున్నది కాదు. వెళ్ళి తీసుకురమ్మని సైరంధ్రిని పంపించిన రాణి ఆమె కదా? ఇక దేవతల రాజు ఇంద్రుడికి మరో వ్యసనం, ఆడవాళ్ళను చూస్తే చలించిపోయి, వాళ్ళ భర్తల రూపంలో వెళ్ళేవాడట, శ్రీకృష్ణుడి తర్వాత యాదవులందరూ బాగా మద్యం తాగి గొడవలు పెట్టుకుని కొట్టుకుని చచ్చిపోయారని కూడ చదివాం కదా. ఆ తర్వాత రాజుల రోజులలో, పాదుషాల రోజులలో, ఇంగ్లీషు వారి కాలంలో అప్పటి నుండి యిప్పటిదాకా సాహిత్యం, చరిత్ర, సినిమాలు, నాటకాలు, టివి. కార్యక్రమాలు, పెద్ద గొప్పవాళ్ళు, మరెందరో కలిసి ఈ అలవాట్లని చేశారు. మనకు రోల్ మోడల్‌గా నిలిపారేమో?

అలా మన జీవితాలలోని దేవదాసులు, ఉమర్ ఖయ్యాంలు మరెందరో సినిమా యాక్టర్లు, (మీనాకుమారి, సావిత్రి, హరనాథ్) వంటి వాళ్లందరూ ఆదర్శ

పురుషులుగా / హీరోలుగా మారారా అని నా అనుమానం. మందుతో పాటుగా మత్తును పెంచే అలవాట్లు ఎన్నెన్నో మన సామాజిక జీవితంలోకి రావడం మనం గమనించవచ్చును. "దమ్‌మారోదమ్ – హరేకృష్ణ, హరేరామ" అంటూ మత్తుమందుల బారిన పడి జీవితాలు నాశనం చేసుకున్న, చేసుకుంటోన్న యువతరం ఎందరో మన సమాజంలో వున్నారు. కులం మత్తు, మతం మత్తు, భక్తి మత్తు, దేశభక్తి మత్తు, జాతి మత్తు, క్రికెట్ మత్తు, క్రికెట్ చూస్తూ మిగిలిన ప్రపంచాన్ని మర్చిపోయే మత్తు, రాజకీయ పార్టీల మత్తు, సినిమాల మత్తు, సినిమా హీరోల / హీరోయిన్ల మత్తు, టివిలలో వచ్చే సీరియల్స్ మత్తు, మీడియా పెంచుతోన్న అసత్య ప్రచారాల మత్తు, యిలాంటి మత్తులెన్నో గమ్మత్తుగా సమాజంలోని ఎందరినో ముఖ్యంగా యువతను, మధ్యతరగతి వాళ్లను టార్గెట్ చేసుకుంటూ ఈ మత్తులు పెంచుకునే ప్రయత్నం చేస్తూ వున్నాయి కదా? ఇవన్నీ నాణానికి ఒకవైపు, మరోవైపున గంజాయి, పొగాకు, సిగరెట్, గుట్కా, పాన్‌పరాగ్, అవిల్‌తో మొదలై ఎన్నో రకాల టాబ్లెట్స్, దగ్గుమందులు, సారా, బ్రాందీ, విస్కీ, రమ్ వంటి ఆల్కహాల్‌తో పాటుగా హెరాయిన్, కొకైన్, ఓపియమ్, ఎఫిడ్రిన్ వంటి మత్తు పదార్థాలు నిండివున్న మాత్రలు, ఇంజక్షన్లు, సిగరెట్లతోనో మరో ఆధారంగానో పెద్దల దగ్గరి నుండి యువతరం దగ్గరి, నుండి మహిళల దగ్గరి నుండి చిన్నారుల దాకా అలవాటు చేస్తున్నారనే సంగతి మనకు అర్థమవుతున్నదా? సరదాగా, ఆటలాగా, పోటీలాగా, బహుమతిలాగా యిలాంటి అలవాట్లు మొదలుపెట్టి, ఉచితంగా యిస్తున్నట్లు సాకులుపెట్టి, ఈ అలవాట్లను వ్యసనంగా మారుస్తోన్న కొందరు నేరగాళ్ళు, వాళ్ళ ఆలోచనలు మనకు అర్థమవుతున్నాయా? చిన్నతనంలో సరదాగా యిలాంటి అలవాట్లు చేసుకుని, ఈ వ్యసనాలకు బానిసలుగా మారి జీవితాలు నాశనం చేసుకొంటున్న చిన్నారులు, యువతులు, యువకులు మన సమాజంలో రోజురోజుకూ పెరుగుతోన్న విషయం మనకు తెలియదా? పుణ్యభూమి, దేవతలు నివసించిన పవిత్రభూమి, సంస్కృతి, సంప్రదాయాలు విలసిల్లిన ఈ భరతభూమిలో యువతరం, చిన్నారులు యిలాంటి మత్తు పదార్థాలకు బానిసలుగా మారుతుంటే ఈ నాయకులు, రాజకీయ నాయకులు, అధికారాలు, ప్రభుత్వం, నైతికంగా భారతదేశాన్ని ఉన్నత స్థాయిలో నిలపెడతాం అంటోన్న భక్తులు, రుషులు, దైవ పురుషులు, బాబాలు, మతపెద్దలు, పాస్టర్లు, ముల్లాలు మరెందరికో యిలాంటివి పట్టవా? అవసరం లేదా? మత్తుల గురించి మాట్లాడుకునే ఈ సమయంలోనే మత్తుకు / మద్యంకు వ్యతిరేకంగా మన గ్రామాలలోని మహిళలు / తరతరాల నుండి అనేక విధాలుగా తలలుదించుకుని బ్రతుకుతోన్న మహిళలు ఒకసారి తలెత్తి, గొంతెత్తి సూటిగా ఈ సమాజంలోని అధికారాలను, నాయకులను, సంప్రదాయాలను, రాజకీయపు ఎత్తుగడలను ప్రశ్నించి మహిళల శక్తి సామర్థ్యాలను రుచి చూపించిన మహాఉద్యమం "సారా వ్యతిరేక ఉద్యమం", తర్వాతి రోజుల్లో "మద్యపాన వ్యతిరేక ఉద్యమం" పూర్వాపరాలు కొంతైనా మనం తెలుసుకొని వుండాలి. నాలుగు అక్షరాలు నేర్చుకుని, సమాజంలోని మంచి

చెడులు ఆలోచించి తమ కుటుంబాన్ని, పిల్లలను మంచి దారుల్లో నడిపించాలనే ఆలోచనతో / ఆశలతో గ్రామ ప్రాంతాలలోని మహిళలు ఒక్కటై "మా వూరికి సారావద్దు" – అనే నినాదంతో కదలడం, అతి కొద్ది రోజులలో అనేక ఊళ్ళకు, గ్రామాలకు, మండలాలకు, జిల్లాలకు పాకడం, ఆడవాళ్ళతో కలిసి విద్యార్థినీ విద్యార్థులు, మగవాళ్ళు, సమాజపు ప్రగతి కోసం ఆలోచించే ఎందరో ఈ ఉ ద్యమంతో కలిసి నడిచారు. గ్రామంలోని వాలంటీర్లు, సాక్షరతా ఉద్యమ రథసారథులు, ఉపాధ్యాయులు, జన విజ్ఞాన వేదిక వంటి సంస్థలు ఎందరో వీళ్ళతో కలిసి నడిచారు. పాటలు పాడారు, కళారూపాలు ప్రదర్శించారు. చర్చలు జరిపారు. సారా దుకాణాలు మూయించారు, ఆ అంగళ్ళపైన సారా సమాధులు (అరుగులు) కట్టించారు. సారా పాటలు ఆపించారు. దొంగ సారా వస్తోంటే ఊళ్ళల్లో కాపలాలు కాశారు. గవర్నమెంట్ సారా అమ్మడానికి ప్రయత్నిస్తే ఎదుర్కొన్నారు. నాయకురాళ్ళుగా ఎదిగారు. ఊరిబాగుకోసం అనేక విధాలైన సర్వేలు జరిగాయి. ఎందరో దేశవిదేశాల నుండి వచ్చి ఈ ఉద్యమాన్ని అధ్యయనం చేసారు. ఈ కొన్ని నిజాలు మనకు అర్థం కావాలి.

1) ఈ ఉద్యమంపైన రిసెర్చి జరిపారు. మేధావులు ఆలోచించారు, వీటన్నింటిలో నుండి మహిళల నుండి ఆరంభమైన పోరాట రూపం / ధిక్కార రూపం.

2) వలంటీర్లుగా పనిచేసిన వాళ్ళలో ఎక్కువమంది ఆడపిల్లలు, అణగారిన వర్గాల పిల్లలు ప్రతినిధులుగా ఆరంభించిన ఉద్యమం యిది.

3) గ్రామాలలో సారావంటి అలవాట్ల వలన జీవితాలు నాశనం చేసుకొంటోన్న పేదల ప్రతినిధులుగా ఆరంభించిన ఉద్యమం యిది.

4) ఏ రాజకీయ పార్టీలుగానీ, వాళ్ళ సంస్థలుగానీ మనస్ఫూర్తిగా ఈ ఉద్యమంలో సహకారం అందించలేదు, కారణం – ఆ పార్టీల కార్యకర్తలకు ఈ వ్యాపారాలున్నాయి.

5) చాలామంది చదువుకొన్న వాళ్ళకు, మధ్య తరగతి / పెద్ద వాళ్ళకు ఈ ఉద్యమంపైన సానుభూతి లేదు.

6) ఎమ్మెల్యేలు వంటివాళ్ళు వీటిలో పాల్గొనలేదు, కారణం ప్రతి జిల్లాలో మద్యం సిండికేట్లు వాళ్ళే కనుక.

---

# 7. వ్యసనాలు - రాజకీయాలు

**- డా॥ యం.వి.ఆర్. కృష్ణాజీ**

జనవిజ్ఞాన వేదిక (ఏ రాజకీయ పార్టీకి అనుబంధం కాదు) రాష్ట్ర అధ్యక్షులు, విజయనగరం

వ్యసనాలు ప్రధానంగా మూడు రకాలుగా విభజన చేయవచ్చు.

1. మద్యపానము; 2. ధూమపానము; 3. మాదక ద్రవ్యాలు

పై మూడింటిలో మొదటిది మద్యపానము. మన దేశంలో ప్రతీ సంవత్సరము 8 లక్షల కోట్ల రూపాయల మద్యాన్ని త్రాగుతున్నారు. 30 వేల కోట్ల రూపాయలు ధూమపానం (సిగరెట్లు) త్రాగుతున్నారు. మరో వ్యసనం మాదక ద్రవ్యాల రూపంలో 50 వేల కోట్ల రూపాయలు ఖర్చు చేస్తున్నారు. ఒక సర్వే ప్రకారం మద్యాన్ని 80% సేవించేది పేద, మధ్య తరగతి ప్రజలే. కష్టజీవులు, కార్మికులు, రోజు కూలీలే ఎక్కువగా త్రాగుడు వ్యసనంతో ఉన్నట్లుగా తెలుస్తున్నది. 18 సం॥ల నుండి 35 సం॥ల వయస్సు మధ్య గల యువతరం ఈ వ్యసనంతో ఉంటున్నది.

మద్యం లేకపోతే జీవితంలో సంతోషమే లేదని, మద్యంపై వచ్చే ఆదాయం లేకపోతే మన ప్రభుత్వాలు కూడా నడపలేరనే భావనా యిప్పుడు సర్వత్రా వ్యక్తమవుతుంది. మన దేశంలోనే గల చాలా రాష్ట్ర ప్రభుత్వాలు గుజరాత్, బీహార్, నాగాలాండ్, లక్షద్వీప్, కేరళ, మణిపూర్, మిజోరామ్‌లలో మద్య నిషేధం అమలులోనున్నది. అలాగే ప్రపంచ వ్యాప్తంగా చూస్తే ఆఫ్ఘనిస్తాన్, బంగ్లాదేశ్, పాకిస్తాన్, బ్రూనే, ఇజ్రాయిల్, లిబియా, యు.ఎ.ఇ., సౌదీ అరేబియా, సూడాన్, కువైట్ మొ॥గు దేశాలలోనూ మద్య నిషేధం అమలులో నున్నది. పైన తెలిపిన రాష్ట్రాలలోనూ, దేశాలలోనూ ప్రభుత్వాలు బాగా అభివృద్ధి సాధిస్తున్నాయి కూడా. కావున మద్యం ఆదాయం లేకపోయినా ప్రభుత్వాల అభివృద్ధి పథంలో పయనించవచ్చు.

ఈ మధ్య బ్రాందీషాపులు జాతీయ రహదారుల ప్రక్క నుండగూడదని చట్టం చెబుతుంటే, మన ఆంధ్రప్రదేశ్ శాసన సభలో జాతీయ రహదారుల పేర్లు రాష్ట్ర రహదార్లుగా మార్చుడం మనం గమనించవచ్చు. రాజకీయాల్లో నాయకుల, సారా కాంట్రాక్టర్ల ప్రయోజనాల గురించి చట్టాల్ని ఎలా మారుస్తున్నారో మనం

గమనించవచ్చు. మద్యం వలన సమాజం ఎలా ప్రభావితం అవుతుందో గమనిస్తే అయిదు అంశాలుగా మనం చూడవచ్చు.

1) **ఎన్నికలు :** మనది ప్రపంచంలోనే అతి పెద్ద, విభిన్నమైన రాజ్యాంగం, ప్రపంచంలోనే రెండవ అతిపెద్ద జనాభా గల దేశంగా ప్రజాస్వామ్య దేశంగా మనం ప్రతీ ఐదేళ్ళకొకసారి ప్రజా ప్రతినిధులను, అసెంబ్లీలకు, పార్లమెంటుకు, స్థానిక సంస్థలకు ఎన్నికల ద్వారా ఎన్నుకోవాల్సిన అవసరం ఉంది. ఈ ఎన్నికలు సజావుగా, నిజాయితీగా జరిగితేనే సరైన ప్రతినిధులు ఎన్నికవుతారు.

ఈ ఎన్నికలను మద్యం సరఫరా చేస్తూ, ధనాన్ని పంచుతూ చేసే ఒక తంతుగా మార్చడంలో మన పరిపాలకులు సఫలీకృతమైనారు. ఈ ఎన్నికలలో మద్యాన్ని ఎరగా చూపి తమకు ఓట్లు వేసేటట్లుగా చేస్తున్న స్థితిలోనే సుమారు 80 శాతం మనం చూస్తున్నాం. మద్యం ద్వారా ఎన్నికలను తమవైపునకు తిప్పుకోడానికి ఉపయోగించుకుంటున్నారు ప్రస్తుతమున్న అధికార, ప్రతిపక్ష పార్టీల నాయకులు.

2) **యువతరంపై ప్రభావం :** 18 సం॥ల నుండి 35 సం॥ల వయస్సు మధ్యలోనే మద్యానికి ఎక్కువగా బానిసవుతున్నారు. ప్రస్తుతమున్న యువతరాన్ని సామాజిక స్పృహతో ఆలోచించకుండా చేయాలన్న దృఢ సంకల్పంతో ఈ మద్యాన్ని ఒక ఆయుధంగా మన పాలకులు ఉపయోగించుకుంటున్నారు. యువతరం ఆలోచించడం ప్రారంభిస్తే ప్రస్తుత మన అవినీతి రాజకీయ నాయకుల పునాదులు పూర్తిగా కదిలిపోతాయేమోనన్న భయంతో కూడా ఈ మద్యాన్ని యువతరంపై ప్రయోగిస్తున్నారు.

3) **మద్యం–వ్యాపారం :** మద్యాన్ని మన దేశంలో వేలకోట్ల వ్యాపారాన్ని చేస్తున్నారు. మనం నిశితంగా పరిశీలిస్తే మద్యం వ్యాపారుల్లో సుమారు 70% మంది చిన్నా, పెద్దా వ్యాపారస్తులంతా మన రాజకీయ నాయకులుగా గమనించవచ్చు.

సుమారుగా ఎక్కువమంది నాయకులకు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ, మద్యం వ్యాపారాలతోనూ, మద్యం వ్యాపారస్తులతోనూ సంబంధాలుండడం మనం చూడవచ్చు.

4) **కార్పొరేట్ ఆసుపత్రులకు మద్దతుగా :** ఈ మధ్యనే కార్పొరేట్ రంగంలోనున్న ఆసుపత్రులకు అన్ని జిల్లాల్లోనూ, కొన్ని వందల ఎకరాలను ధారాదత్తం చేశారు. ఆయా ఆసుపత్రులన్నీ బిజీగా తయారవ్వాలన్నా, పేషెంట్లతో నిండాలన్నా ప్రజల్లో అనారోగ్యం పరిఢవిల్లాల్సిందే. దానికి మన నాయకులు మద్యాన్ని ప్రధాన వనరుగా ఉపయోగిస్తున్నారు.

5) **సామాజిక స్పృహ లేకుండా చేయుటకు:** ప్రస్తుత సమాజంలో రాజ్యాంగంలో నున్న ప్రాథమిక హక్కులను పరిరక్షించుకోవాలంటే ప్రతి పౌరునికి సామాజిక స్పృహ ఉండాలి. ఏ ఒక్క వ్యక్తి తనొక్కడే ఈ సమాజంలో బ్రతకలేడు. ఉదయం లేచిన తర్వాత అందరి సహకారంతో, సహాయంతోనే జీవితమంతా. అందుకనే మనిషిని సంఘజీవి అని అన్నారు. మన హక్కుల గురించి, మన ప్రాథమిక కర్తవ్యం గురించి కనీసమైనా ఆలోచించకుండా ఒక రకమైన మత్తును ఈ పౌర సమాజానికి ఈ మద్యం అందిస్తుంది.

పైన పేర్కొన్న 5 రకాలుగా ఈ సమాజానికి ఎప్పటికీ మన పాలకుల కబంధ హస్తాల నుండి కార్మికులకు, కష్టజీవులకు, రైతన్నలకు ఈ రాజ్యం దక్కకుండా ఈ మద్యం మన నాయకులకు అధునాతన ఆయుధంగా ఉపయోగపడుతుంది. ఈ మద్యం వ్యాపారస్తులను రక్షించడానికే అన్నట్లుగా డ్రగ్ మాఫియా పెద్ద పెద్ద నగరాల్లో తయారై వ్యవస్థను చిన్నాభిన్నం చేస్తూ తమకు అనుకూలంగా చేసుకుంటున్నాయి.

ప్రస్తుతమున్న ప్రజాస్వామ్య వ్యవస్థలో ఎన్నికలు సజావుగా సాగేటట్లు చూడాలంటే మద్యం లేని సమాజం రావాల్సిందే. మద్యం లేని సమాజంలో ఎన్నికలు నిష్పక్షపాతంగా జరుగవచ్చునని ఆశించవచ్చు. పేద, మధ్య తరగతి వర్గాల నుండి కూడా అసెంబ్లీలకు, లోక్‌సభలకు మనం ప్రజాప్రతినిధులను పంపవచ్చు.



# 8. వ్యసనాలతో నిర్వీర్యమవుతున్న వ్యవస్థ

– డా॥ సి. హెచ్. రవికుమార్
జన విజ్ఞాన వేదిక, రాష్ట్ర అధ్యక్షులు, మండపేట

ఒకే అలవాటుని పదే పదే చేస్తూ కొనసాగించడం ద్వారా దానికి బానిసగా మారడాన్ని వ్యసనం అని చెప్పవచ్చు. ముఖ్యంగా కొన్ని పదార్థాలకు సంబందించిన అలవాట్లు మనిషి ఆరోగ్యాన్ని క్రమక్రమంగా దెబ్బతీసి జీవచ్ఛవాల్ని చేస్తాయి. కుతూహలంతోను, ఆసక్తితోను వ్యసనాలు ప్రారంభమవుతాయి. ఆ తర్వాత నెమ్మదినెమ్మదిగా వాటికి అలవాటుపడి, చివరకి బానిసలుగా మారతారు. వ్యక్తుల్ని బలహీనులుగా, బానిసలుగా మార్చి ప్రాణాలు హరించే అలవాట్లు, వేనవేల సంఖ్యల్లో వ్యక్తుల్ని బలితీసుకోవడం ద్వారా వ్యవస్థని కూడా నిర్వీర్యం చేస్తున్నాయి.

మనం నివసిస్తున్న సమాజం యొక్క విలువలు కూడా మన అలవాట్లను నిర్దేశిస్తాయి. ఉన్నతమైన విలువలు పాటించే సమాజాలు వ్యక్తులచేత అలవాట్లను పాటింపచేస్తాయి. సమాజ శ్రేయస్సే వ్యక్తి శ్రేయస్సు అని భావించే సమాజాలు వ్యక్తులకు ఉన్నతమైన సామాజిక విలువల్ని అందించగలుగుతాయి. తద్వారా వ్యవస్థలో ఉత్తమ పౌరులని తీర్చిదిద్దగలుగుతాయి.

కానీ లాభాపేక్ష, ధనార్జన మౌలిక విలువలుగా కలిగిన సమాజాలు వ్యక్తుల్ని ఆశాపరులుగా ప్రోత్సహిస్తాయి. విశృంఖలమైన స్వేచ్ఛకి అవకాశమిస్తాయి. తత్ఫలితంగా వ్యక్తులు తమ స్వేచ్ఛ ప్రథమ అంశంగాను, సమాజ శ్రేయస్సు రెండవ అంశంగాను చేసేవారుగా మారతారు. వక్రీకరించబడిన వ్యక్తి స్వేచ్ఛ వ్యక్తుల్ని అన్నిరకాల వ్యసనాలవైపు లాగుతుంది. లాభంకోసం జీవితం ఉద్దేశించబడిన సమాజంలో పౌరులు తమ ఆనందం కోసం అన్ని రకాల సామాజిక విలువల్ని తుంగలో తొక్కుతారు. దాని ఫలితంగా డబ్బు సంపాదన సులభం అనుకుంటే ఏ విధమైన వ్యాపారానికైనా ప్రాధాన్యతనిస్తారు. ఈనాడే నడుస్తున్న మద్యం, డ్రగ్స్ వ్యాపారాలు వేలకోట్ల మీద జరుగుతున్నాయి. కొద్దిమంది ఆదాయాలు లక్షలమంది జీవితాలతో చెలగాటమాడడం మనం చూస్తున్నాం.

సాధారణంగా వ్యసనాలు వ్యక్తిగతమైనవిగానే మనం భావిస్తాం. కానీ సామాజిక ప్రోత్సాహం లేకుండా వ్యసనాలు నడవవు. వ్యసనాల మీద నియంత్రణ, నిషేదం ఉన్న సమాజంలో వ్యసనాలు కొనసాగలేవు కూడా. ఇది వ్యసనాలను

మనం సామాజిక కోణం నుంచి అర్థం చేసుకోవాల్సిన అవసరం ప్రభుత్వమే మద్యం దుకాణాలకు లైసెన్సులు ఇస్తున్నంతకాలం, మద్యాన్ని ఆదాయ వనరులుగా చూస్తున్నంత కాలం మద్యరహిత సమాజాన్ని మనం ఊహించలేం కదా! మద్యపానాన్ని తాత్కాలికంగా నిషేధించిన కాలంలో మంచి ఫలితాల్నే మనం చూసాము. అలాగే మద్యం అమ్మకాల్ని, వాడకాల్ని పూర్తిగా నిషేధించిన రాష్ట్రాలలో, ప్రాంతాలలో సామాజిక రుగ్మతలు తగ్గిన గొప్ప ఫలితాల్ని ఈనాటికీ మనం చూస్తున్నాం. ఇదే అంశం పొగాకు, ధూమపానం, గుట్కా, ఖైనీ నిషేధించిన ప్రాంతాలలో మనకు కన్పిస్తుంది. కాబట్టి ఒక వ్యసనాన్ని పూర్తిగా నిషేధించాలనే ఆదర్శం ప్రభుత్వం, సమాజం పూనుకుంటే అసాధ్యమేమీ కాదు.

ఈనాడు మన సమాజంలో అవిద్య, పేదరికాలే వ్యసనాలకు మూల కారణాలుగా చెప్పుకోవచ్చు. విద్య, విచక్షణా జ్ఞానం లేకపోవడం వల్లే యువకులు, ప్రజలు మద్యం, మాదకద్రవ్యాల ఉచ్చులోకి నెట్టబడుతున్నారు. మద్యపానానికి రెండో ముఖ్య కారణం పేదరికం. పేదరికం కారణంగానే ప్రజలు మద్యపానానికి బానిసలౌతున్నారని సాక్షాత్తూ ప్రపంచ బ్యాంకు సర్వే తెలియజేయడం ఒక సంచలనాత్మకమైన సంగతి. ప్రజలు పేదరికం వల్ల తాము నిత్యం ఎదుర్కొంటున్న ఈతిబాధల్ని పరిష్కరించుకోలేని నిస్సహాయతకి నెట్టబడుతున్నారు. పేదలు తాము అనుభవిస్తున్న ఆర్థికలేమివల్ల తాము కష్టాలకి ఎంత ఎదురొడ్డినా బయటపడే దారి కన్పించుటలేదు. తత్ఫలితంగా తాత్కాలిక ఉపశమనం కోసం, పలాయనం కోసం ప్రజలు అనివార్యంగా మద్యం మత్తుని ఆశ్రయిస్తున్నారు. తమ దుస్థితి, నిస్సహాయతల వల్లే మద్యం మత్తులోకి దించబడుతున్నారు. ముంచబడుతున్నారు. ఇది సాక్షాత్తూ ప్రపంచ బ్యాంకు సర్వే వల్ల నిగ్గుతేల్చిన సత్యం. ఇలాంటి విషయం యొక్క ప్రస్తావనే ప్రపంచ ప్రసిద్ధి పొందిన "గోర్కీ అమ్మ" నవలలో మనకు కనిపిస్తుంది. ఈ నవలలో పావెల్ కథా నాయకుడు. పావెల్ తండ్రి కార్మికుడు. అతను మద్యానికి బానిసై రోజూ తన భార్యను హింసిస్తుంటాడు. తన తండ్రి అనుభవిస్తున్న పనిభారము, ఆర్థిక బాధలే అతని తండ్రియొక్క మానసిక ప్రవర్తనకి, దౌర్జన్య ప్రవృత్తికి కారణాలుగా పావెల్ గ్రహిస్తాడు. ఈ పుస్తక రచయిత గోర్కీ మనుషులు అనుభవిస్తున్న హింసకి తెర వెనుకగల కారణాల్ని మన కళ్ళకు కట్టినట్లుగా విశ్లేషిస్తాడు. ప్రపంచ బ్యాంకు చెప్పినట్లే నిస్సహాయులైన ప్రజలే వ్యసనాల ఊబిలో కూరుకుపోతున్నారనే విశ్లేషణ ఒక సామాజిక సత్యం.

పేదరికం అంశం ప్రస్తావన ఒకటే కాకుండా మద్యపానం వల్ల వచ్చే సమస్యలను ప్రపంచ బ్యాంకు ఈ విధంగా పేర్కొంది. "ఆల్కహాలు తీసుకోవడం అనేక అనర్థాలకు దారితీస్తుంది. కుటుంబ హింసకు మద్యం ప్రధాన కారణం, మద్యం తీసుకొనేవారు పనిచేసేచోట ఉత్పత్తి పడిపోతుంది. ప్రమాదాలు జరుగుతున్నాయి. మద్యానికి బానిసలైనవారు పని పోగొట్టుకుంటున్నారు. నిరుద్యోగులుగా మారుతున్నారు. ఇది ప్రపంచ బ్యాంకు స్థూల విశ్లేషణ. కాబట్టి మద్యం వ్యక్తిగత, కుటుంబ సమస్యలనే కాకుండా సామాజిక సంక్షోభాన్ని ఎలా సృష్టించగలుగుతుందో ప్రపంచ బ్యాంకు విశ్లేషణే అద్దం పడుతుంది.

వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ లెక్కలు మరిన్ని ఆసక్తికరమైన అంశాలను వెలుగులోకి తీసుకొచ్చింది. యు.కె.లో ఒక వ్యక్తి సంవత్సరానికి సగటున 29.8 గ్రా॥ ఆల్కహాలును తీసుకుంటే అదే భారతదేశంలో సగటున ఒక వ్యక్తి 62.7 గ్రాములను సేవిస్తున్నారని తెలిపింది. ప్రపంచ ఆరోగ్య సంస్థ లెక్కల ప్రకారమే దక్షిణ తూర్పు ఆసియాలోనే అత్యధికంగా మద్యం సేవించే దేశం భారతదేశమే. ఇందులో మరింత దారుణమైన సంగతేమిటంటే ఈ సంఖ్య మరింత విజృంభించి గత 20 సంవత్సరాల కాలంలో 55%కు పెరిగింది. ప్రతిమామూర్తి, బ్రిజ్‌బేడీ అనే సామాజిక కార్యకర్తలు "ఇండియన్ జర్నల్ ఆఫ్ సైకాలజీ" అనే పత్రికలో వ్రాసిన వ్యాసంలో గణాంకాల్ని వివరిస్తూ మద్యపానం మన సమాజాన్ని పతనం అంచున నెడుతుందని పేర్కొన్నారు. మద్యం కారణంగా ప్రజలు తమ ఆరోగ్యాన్ని, ఆలోచనాశక్తిని పోగొట్టుకుంటున్నారు. తాము ఎదగలేక, తమ చుట్టూ ఉన్న సమాజాన్ని సాంస్కృతికంగా ఉన్నతీకరించుకోలేని దుస్థితిలోనే బ్రతుకును ఈడ్చేస్తున్నారు. మన సమాజం మధ్యయుగాల సంస్కృతిలోనే స్తంభించిపోయి ఉండడానికి మద్యం ప్రధాన కారణం కాదని చెప్పలేము.

భారతదేశంలో సగటున 30% మంది ప్రజలు రోజూ ఆల్కహాలు తీసుకుంటున్నారు. 11% మంది ప్రజలు మోస్తరుకు మించి అతి తాగుబోతులుగా మారుతున్నారు. మన గ్రామీణ భారతీయులు సగటున తీసుకునే ఆల్కహాలు 11.4 లీటర్లుగా ఉంది. ఆల్కహాలు తీసుకోవడంలో దక్షిణభారతదేశంలోని ఇతర రాష్ట్రాలకంటే ఆంధ్రప్రదేశ్‌లోని యువకులే ముందున్నారని ఒక సర్వే చెబుతుంది. ఇది మిగిలిన ప్రాంతాలకంటే ఆంధ్రప్రదేశ్‌లో 55% ఎక్కువని గణాంకాలు చెప్తున్నాయి. ఆల్కహాలు తీసుకోవడం వల్ల ఇప్పటి వరకు 3.3 మిలియన్లమంది ప్రజలు చనిపోయారని ఒక అంచనా. ఆల్కహాలు సేవించడం వల్ల ప్రతీ 96 ని॥లకు

ఒక మరణం సంభవిస్తుందని నివేదికలు చెప్తున్నాయి. ఇదీ నిషాలో మునిగిన మన విషాద భారతం.

ఆల్కహాలు సృష్టిస్తున్న విధ్వంసం ఈ విధంగా ఉంటే, చాపకింద నీరులా విస్తరిస్తున్న మత్తుపదార్థాలు (డ్రగ్స్) వాడకం మరింత ఆందోళన కల్గిస్తుంది. మన భారతదేశంలో గత 10 సం॥ల కాలంలో డ్రగ్స్ వాడకం వల్ల 25,426 ఆత్మహత్యలు జరిగాయి. ఇది ప్రతి సంవత్సరం సగటున 2541 మందిగా ఉంది. భారతదేశంలో మత్తు పదార్థాలకు బానిసైన వారి సంఖ్య సుమారు 3.4 మిలియన్లు. అదే ఆల్కహాలు కూడా సేవించేవారిని కూడా ఈ లెక్కలలో కలుపుకుంటే అది సుమారుగా 11 మిలియన్లు. దేశంలోనే అత్యధికంగా 75% మంది యువత డ్రగ్స్‌కి బానిసలౌతున్నారు. అంటే ప్రతీ నలుగురిలో ముగ్గురు మత్తుకి బానిసలే. ఉక్కునరాలు, ఉన్నత సంకల్పాలతో దేశాన్ని తీర్చిదిద్దాల్సిన యువతరం మత్తులో మునిగిపోతుంటే దేశం భవిష్యత్తు ఏమిటనేది ప్రశ్నార్థకమేకదా!

మత్తు, మాదకద్రవ్యాలు, మద్యం సేవించడం అనేక రూపాలలో సామాజిక హింసకు దారితీస్తుంది. ఢిల్లీలో నిర్వహించిన ఒక సర్వే ఈ విషయాన్ని తెలిపింది. ఈ సర్వేని మనం భారత సామాజిక న్యాయమంత్రిత్వ శాఖ మరియు యునైటెడ్ నేషన్స్ డ్రగ్స్ కంట్రోల్ ప్రోగ్రామ్ సంస్థలు కలిసి సంయుక్తంగా నిర్వహించాయి. ఈ సర్వే ఢిల్లీలో మహిళలు అనుభవిస్తున్న రుగ్మతలకు గల కారణాల వెనుక అనేక చేదు నిజాల్ని వెల్లడించింది. మత్తు, మద్యం సేవించే కుటుంబాలలోని భర్తలు, తండ్రులు, సోదరుల వల్ల అనేక విధాలైన హింసలకు, అవమానాలకు, వ్యాధులకు మహిళలు గురౌతున్నారని ఈ సర్వే చెప్పిన సారాంశం. మద్యం, మాదక ద్రవ్యాల కారణంగా అత్యధిక స్త్రీలు కుటుంబ హింసకు గురౌతున్నారు. హెచ్.ఐ.వి. లాంటి వ్యాధుల భారిన పడుతున్నారు. 47% మంది మహిళలు అవమానం, సిగ్గు, డిప్రెషన్ లాంటి మానసిక రుగ్మతలకు గురౌతున్నారు. 50% మంది మహిళలు మానసిక ఆందోళనకు, 35% మంది ఒంటరితనంతోను, 45% మంది బరువు తగ్గడంతోను, 23% మంది నొప్పులు మరియు ఇతర శారీరక బాధలతోను, 47% మంది మహిళలు నిద్రలేమితో బాధపడుతున్నారని ఈ సర్వే చెబుతుంది. ఇది ఢిల్లీలో జరిగిన ఒక శాంపిల్ సర్వే మాత్రమే దీనిని బట్టి భారతదేశం మొత్తంలో కుటుంబ హింస, అవమానాల ముఖచిత్రం ఏ విధంగా ఉంటుందో మీరు ఊహించవచ్చు. మత్తు ప్రపంచం తాత్కాలికమైన స్వర్గాన్ని సృష్టించే అందమైన నరకం. ఇంత అశాంతిపూరిత త్రిశంకు స్వర్గంలో సుఖ శాంతులకు చోటెక్కడుంటుంది?

మద్యం, మత్తు పదార్థాలు వ్యసనాల వల్ల మనుషుల ఆరోగ్యం దెబ్బతింటుందనేది ఉపరితల అంశం. కానీ వీటివల్ల ఎంత సామాజిక విధ్వంసం జరుగుతుందో మన అందరం ఆలోచించుకోవాల్సిన సందర్భం. మద్యపానం దురలవాటు మన సమాజాన్ని రోగగ్రస్తంగానే కాకుండా నేరగ్రస్తంగా కూడా మారుస్తుంది. నిత్యం జరిగే అనేక నేరాలలో 70-85% నేరాలు ఆల్కహాలు సేవించడం వల్లే జరుగుతున్నవని ఒక నివేదిక తెలియజేసింది. జాతీయ నేర సమాచార సంస్థ (ఎన్.సి.ఆర్.బి.) నివేదికలో 2014 లెక్కల ప్రకారం ఆల్కహాలు సేవించి నేరాలు చేసేవారి జాబితా ఈ విధంగా ఉంది. ఈ లెక్కల ప్రకారమే 2026 మంది బాలికలు మరియు స్త్రీలు లైంగిక హింసకు గురయ్యారు. 1423 మంది లైంగిక వాంఛ తీర్చమని వేధించబడ్డారు. ఆల్కహాలు మన సమాజంలో ఇంత అమానుషాన్ని సృష్టిస్తుంది. అంతర్జాతీయ సమాజం చేసిన అనేక అధ్యయనాలు సామాజిక నేరాల విశ్వరూపానికి మద్యం, డ్రగ్స్ ప్రధాన కారణాలుగా పేర్కొంటున్నారు. అవినీతి, అక్రమ మార్గంలో డబ్బు సంపాదనను అనైతికంగా డబ్బుల బదిలీ, కుట్రలు-నేరాలు, మహిళల అక్రమ రవాణా, టెర్రరిజం లాంటి సామాజిక నేరాల మూలాలలో మద్యం, డ్రగ్స్ ప్రభావం బలంగా ఉందని అధ్యయనాలు చెబుతున్నాయి. కాబట్టి సమస్య ఎంత జఠిలంగా ఉందో మనం అర్థం చేసుకోవచ్చు. ఈ వ్యసనాల వల్ల, వ్యసనాలు సృష్టించే పర్యవసానాల వల్ల మన వ్యవస్థ జీవనాడులు కుంగిపోతున్నాయి. ఈ వ్యసనాల మూలాలు మనకి అనేక ప్రశ్నలు లేవదీస్తున్నాయి. తరచి తరచి చూస్తే దీనికి అనేక కారణాలు కన్పిస్తున్నాయి. మారుతున్న సామాజిక విలువలు, నిరుద్యోగం, గ్లోబలైజేషన్, పట్టణీకరణ, ఉమ్మడి కుటుంబాల విచ్ఛిన్నం, పేదరికం, ఆందోళనతో కూడిన జీవితం, చుట్టుప్రక్క దేశాల మాఫియాల ప్రభావం ఇవన్నీ కలగలపుగా వ్యసనాల వ్యవస్థని ప్రేరేపిస్తున్నాయి. వ్యసనాల పుట్టుక, పెరుగుదల వ్యవహారాన్ని మనం చాలా విస్తృతార్థంలోనే చూడాలి. ఈ సమస్యమూలాల్ని, అందులో ఉన్న అంతర్గత అంశాల్ని క్షుణ్ణంగా అర్థం చేసుకునే ప్రయత్నం చేయాలి. తద్వారానే శాస్త్రీయ పద్ధతిలో పరిష్కారాలని వెతకవచ్చు. శాశ్వత పరిష్కార మార్గాలకోసం ప్రయత్నించవచ్చు. ఈ రుగ్మతల నుంచి మన సమాజాన్ని భావితరాల్ని కాపాడుకునే దిశగా ఆలోచనాపరులు సామాజిక బాధ్యత కల్గినవారు అడుగులు వేయాలి.

---